# అంకితం

తెలంగాణ కోసం పెయ్యి
దీపం వత్తోలె అంటిచ్చుకున్న
శ్రీకాంతాచారి, యాదయ్య, వేణుగోపాల్‌రెడ్డి
యాదిల

# వల్లి

ఉద్యమాలు తెలంగాణకు కొత్తకాదు. ఇక్కడి మన్ను మట్రవడే సారంలనే తిరుగుబాటు లక్షణం ఉన్నది. నైజాం రాజ్యంమీద దొరలతోని పోరాడిన వారసత్వం నుంచే తెలంగాణ ఉద్యమం లేచింది. నవంబర్ 29, 2009 తర్వాత అది మంటర మంటర అంటుకున్నది. అమరణ దీక్షకు కూర్చోనున్న చంద్రశేఖరరావును అరెస్ట్ చేసి జైల్లో పెట్టిన తర్వాత తెలంగాణ మొత్తం అగ్గి మీద గుగ్గిలమైంది. అంతకు ముందు నుంచే కడుపు మండిన మంది ఎవలకు వాళ్ళే బజార్లకు వచ్చింద్రు. గడిచిన పదేండ్లల్ల తెలంగాణలోని ఉద్యోగులు, కార్మికులు, రైతులు, కూలీలు, విద్యార్థులు, సబ్బండ వర్ణాలు తాము అన్ని రంగాలల్ల 'ఆంధ్ర' దోపిడికి గురవుతున్నామని లెక్కా పత్రంతో సహా అర్థం చేసికున్నరు. మానసికంగ, సాంస్కృతికంగ ఆంధ్ర, తెలంగాణ వేరు వేరు అని రూఢీ అయింద్రు. ఇందుకు తెలంగాణ తల్లి విగ్రహం, తెలంగాణ రాష్ట్ర పటం, తెలంగాణ భాష , తెలంగాణ పండుగలు వేరనే భావన సర్వత్రా వ్యాపించింది.

నీళ్ళు, భూములు, ఉద్యోగాలు, బొగ్గు, కరెంటు అన్నీ ఇక్కడి నుంచి ఆంధ్ర కమ్మ సంపన్న వర్గాలు కొల్లగొట్టుకపోతున్నయి. అట్లనే తెలంగాణ భాష, సంస్కృతి, పండుగలు, సాహిత్యం, చరిత్ర అన్నిటినీ మరుగున పెట్టి ఆంధ్రాన్ని యాభై ఏండ్లుగ రుద్దింద్రు. సంస్కృతి సమస్త వనరులు దోపిడికి గురవుతుంటే ఇక్కడి రాజకీయ నాయకులు వీటి గురించి పట్టించుకోలేదా అంటే మా పట్టిచ్చి కున్నరు గని వీల్లను వాళ్ళు ఏడ కమ్మాల్నో అన్నే కమ్మింద్రు. అందుకే తెలంగాణల ప్రజలు ఉద్యమిస్తుంటే రాజకీయ జీవులు ఎనుకపట్ల నడుస్తున్నట్లు కన్పిస్తది. తెలంగాణ ప్రజలు సహజంగనే ఉద్యమ స్వభావం గలవాళ్లే. ఉద్యమాలకు నాయకత్వం వహించే నాయకులతోనే చిక్కు వచ్చింది. 1969 లనే చూసినం ద్రోహం. ఎప్పటికైనా ఆంధ్ర కనుసన్నల్లో వాళ్ళ రిమోట్ మీట తరంగాల పరిధిలో మెలిగే నాయకత్వం వల్లనే ఉవ్వెత్తున లేచిన ఉద్యమాలు చల్లారినట్లు అయితన్నయి.

నవంబర్ నెల చివరి నుంచి డిసెంబర్ 9న చిదంబరం ప్రకటన దాకా ఆ తర్వాత నడుస్తున్న ఉద్యమం చారిత్రకమైంది. తెలంగాణలోని ప్రతి పల్లె, ప్రతి వాడ, ప్రతి రహదారి, ప్రతి చౌరస్తా ఉద్యమ వేదికైంది. ప్రదర్శనలు, నినాదాలు, ప్లకార్డులతో విద్యార్థులు, న్యాయవాదులు, డాక్టర్లు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, వృత్తి కార్మికులు, కుల సంఘాలు, స్వశక్తి సంఘాల మహిళలు, యువజన సంఘాలు, సకల గుంపులు ఈ ఉద్యమంలో స్వచ్ఛందంగా ఉరికచ్చి కల్సినయి. ఎక్కడికక్కడ జయింట్ ఆక్షన్

కమిటీలు ఏర్పడ్డయి. నిరాహారదీక్షలు, ధూంధాంలు, సభలు, సమావేశాలతో తెలంగాణ పది జిల్లాలు అగ్గి అగ్గి అయినయి. తెలంగాణ ప్రక్రియ మొదలైందన్న ప్రకటన వెంటనే ఆంధ్రోళ్ల (ఆంధ్రోళ్ల అంటే తెలంగాణను వ్యతిరేకించే కొద్ది మంది పాలక, పారిశ్రామిక, సినిమా, మీడియా వర్గాలు అని అర్థం చేసుకోవాలె) కండ్లు శిమశిమన్నయి. వాళ్ళు నోటికాడ బుక్క ఎత్త కొట్టింండ్రని, తినే ఇస్తారిల మన్ను వోసింండ్రని ప్రతి తెలంగాణీయుడు గర్తుంచుకున్నడు. కేంద్రాన్ని ఒత్తిడిలకు గురిచేసి నిప్పుల మీద నీళ్లు చల్లినట్టు కమిటీ కాలయాపనకు ఏపిచ్చింండ్రు.

డిసెంబర్ 9 తర్వాత కోస్తాంధ్రలో వచ్చిన వొల్లెక్కల ఉద్యమాల్లో పాట గాని, కవిత గాని, నినాదం గాని కన్పించదు. కేవలం హేతువుకు నిలవని "సమైక్యంగా ఉండాలె" " తెలుగు జాతి విడి పోవద్దు" అనే పడికట్టు మాటలే. ఇప్పుడేదో సమ ఐక్యంగా ఉన్నట్టు, కల్సి ఉన్నట్టు మాట్లాడుతరు. ఇక్కడ బతుకమ్మ పండుగ అక్కడ జరుపుకుంటే, ఇక్కడ 'అసోయ్ దూలా' అక్కడ సుత ఆడితె కల్సిమెల్సి ఉన్నట్లు, కానీ అక్కడి ఆంధ్ర భోజనాలు, గోంగూర పచ్చళ్ళు ఇక్కడ అమ్ముకోంగనే కల్సినట్టు కాదనే విషయం పట్టించుకోరు. అయితే ఆంధ్రా ప్రాంత దళిత బహుజన ప్రజాస్వామిక వాదులు తెలంగాణ ఏర్పాటును వ్యతిరేకిస్తలేరు.

ఈ ఉద్యమ సందర్భంలో తెలంగాణ సాహిత్యం ఉదృతంగా వస్తున్నది. గ్రామాల్లో ఎక్కడిక్కడ పాటలు అల్లుకున్నరు. నినాదాలు, క్షైత్వం క్షై కట్టింండ్రు. చారిత్రక సందర్భాల్లో సాహిత్య సృష్టి ఆయా రచనల్లో బలంగా వ్యక్తీకరించబడుతది. తెలంగాణ రాష్ట్ర ఆవశ్యకత అంటే కేవలం భౌగోళిక సరిహద్దులతోనే తెలంగాణ కాదు. సకల అన్యాయాల నుంచి వేరు చేసే తెలంగాణను కవులు, రచయితలు కోరుకుంటున్నరు. భాషా సంస్కృతికి అస్తిత్వం స్వయంపాలనను కోరుతున్నారంటే స్థానికతను, ఆత్మగౌరవాన్ని డిమాండ్ చేస్తున్నట్టు. ఇదంతా గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకమే. అగ్రరాజ్య వ్యాపార సామ్రాజ్య దాహానికి స్థానికతావాదం ఎప్పుడైనా ఎదురొడ్డుతుంది. అందువల్ల తెలంగాణ సాహిత్యం, తెలంగాణ అస్థిత్వ ఉద్యమం ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టిన విల్లు. ఉద్యమంలో ఏ పాటను ఏ కవితను తాకి చూసినా ప్రాంతీయుతా ముద్ర తొణికిసలాడుతది. పది జిల్లాల్లో ఇదే రీతిగా సాహిత్య సృష్టి జరిగింది. ఈ నేపథ్యంలోనే కరీంనగర్ జిల్లా నుంచి వచ్చిన ఉద్యమ కవిత్వాన్ని ఒక్క దగ్గర కుప్ప చేస్తే ఈ "వల్లుబండ". ఉద్యమ నేపథ్యంలో రాసిన కవిత్వంలోని వస్తువునే ప్రధానం చేసికోవాల్సి ఉంది.

తెలంగాణ ఉద్యమానికి విద్యార్థుల నుంచి మొదలు పండితుల వరకు ఎందరో తమ కడుపులోంచి తన్నుకవచ్చే దుఃఖాన్ని, కోపాన్ని, ఆలోచనలను వ్యక్తీకరించారు.



కరీంనగర్ జిల్లా కవిత్వంలో కథల్లో ముందున్నదనే విషయం చరిత్ర చెప్పుతున్నది. ఒకరకంగా చూస్తే తెలంగాణ ఉద్యమానికి తెలుగు సాహిత్యలోకం కూడా ఆమోద ముద్ర వేసింది. ఎందుకంటే తెలంగాణ వ్యతిరేకసాహిత్యం తెలంగాణేతరులు వెలువరించినట్టు లేదు. అయితె ఇంకోమాట కూడా మాట్లాడుకోవాలె. తెలంగాణలో పుట్టిన కొందరు సాహిత్య కారులు తెలంగాణ గురించి వద్దనకుంట, కావాలనకుంట మౌనంగా ఉంటన్నరు. అట్లనే ఆంధ్రలో పుట్టి తెలంగాణకు బతకవచ్చిన సాహిత్యకారులు సుత ఇదే పద్ధతిల మెలుగుతండ్రు. అయితే వీళ్ళు దోపిడి, అన్యాయాల్ని వ్యతిరేకించరా! అంటే వ్యతిరేకిస్తారు. ఇరాక్‌మీద అమెరికా దాడి చేసినా, ప్రపంచంలో ఎక్కడ అన్యాయం, ఎక్కడ అమానవీయత ఉన్నా రాస్తారు, మాట్లాడుతారు. కాని ఈ గడ్డ మీద బతుక్కుంట, ఇక్కడి నీళ్లు తాగుకుంట ఈ నేలకు జరిగిన అన్యాయం మీద పెన్నులు మూతపెట్టి కూర్చుంటండ్రు.

ఏది నీతి, ఏది ధర్మం, న్యాయం, అన్యాయాలను నిర్ధారించే సునిశిత పరిశీలన సామాన్య ప్రజలకు ఉంది. అట్లనే అన్యాయాన్ని ప్రతిఘటించే తెగింపు పుష్కలంగా ఉంది. అయితే వాళ్ళను మ్యానిపులేషన్ చేయడంలో మీడియా, రాజకీయ పార్టీలు ముందుంటున్నాయి. ఆ ప్రభావాల వలలో పడకుండా ప్రజలను ఉద్యమాల వైపు సంఘటిత పరిచే బాధ్యత కవులు, కళాకారుల పై ఉంది. అందులో భాగంగానే కవులు ఉద్యమాన్ని తల్లి కోడిలా కాపాడుకొంటున్నారు.

కరీంనగర్ ఉద్యమ కవితా సంకలనం కోసం కవిత్వాన్ని కోరగా మస్తుగ స్పందించింండ్రు. జిల్లా నుంచి ఇంతమంది గొప్పగా రాసే వాల్లున్నారని సంబుర పడ్డం. కొత్తగా వస్తున్న తరం నుంచి నలభైవ దశకంలో పుట్టిన పాత తరం వాళ్ళు సుత ఉన్నరు. అందుకు ఎవరి జాడ ఎక్కడో తెలుసుకునేందుకు కవిత చివర కవి పుట్టిన సంవత్సరం, పుట్టి పెరిగిన ఊరు పేరు ఇచ్చినం.

దేవుని గుళ్ళల్లో తాము అనుకున్నది అవునో కాదో చెప్పేది వల్లుబండ. అంతేగాక అది తమ మనసులో ఉన్నది కావాలని మొక్కే మొక్కు. వేములవాడలో, ధర్మపురిలో భక్తులు తమ నమ్మిక కోసం వల్లు పట్కుంటారు. అట్లనే తెలంగాణ కావాలని కోరుకునే నూటిరువై మంది కవుల వల్లు ఈ వయ్యి.

తేది : మే 27, 2010
ఎల్లమ్మ పున్నం (బుద్ధపౌర్ణమి)

- అన్నవరం దేవేందర్
సంపాదకుడు

# ఆక్సీజన్

ఈ పుస్తకం కండ్ల సూడడానికి
ప్రాణవాయువులు సమకూర్చినవారు

డా॥ నలిమెల భాస్కర్

వనమాల చంద్రశేఖర్

నగునూరి శేఖర్

అలుగోజు కుమారస్వామి

ముదుగంటి సుధాకర్‌రెడ్డి

మల్యాల వరదశేషయ్య

సంగెవేని రవీంద్ర

రాచర్ల వెంకట్

తానిపర్తి తిరుపతి రావు

అన్నవరం రాజేశ్వరి



# ఎందరికో వందనాలు

కరీంనగర్ తెలంగాణ ఉద్యమ కవిత్వం పుస్తకంగా వేయాలనే ఆలోచన డా॥ నలిమెల భాస్కర్, జూకంటి జగన్నాథం కు నాకు తట్టింది. వేయాలనుకునే ఆలోచనను సాహితీ సోపతి గాళ్ళతో పంచుకోగా తప్పకుండా రావాలె. తెలంగాణ ఉద్యమ సాహిత్యం చరిత్రలో నిలవాలెనని అందరూ వెన్ను తట్టిండ్రు.

కవి విమర్శకుడు, కోటిలింగాల బ్రాహ్మీలిపిలో 16 అక్షరాలను కొత్తగా పట్టుకొన్న యం. నారాయణ శర్మ తన సెలవుల్ల వల్లు పడితేనే ఇది వెలువడింది. అట్లనే కవిత్వాన్ని పంపాల్సిందిగా కోరంగనే పంపిన కవి మిత్రులకు కృతజ్ఞతలు. ఇందుకు సహకరించిన తెలంగాణ రచయితల వేదిక, సాహితీ గౌతమి మిత్రులకు కృతజ్ఞతలు. పెద్దింటి అశోక్‌కుమార్, కె.వి. నరేందర్, మా గోపాల్, ముఖచిత్రం వేసిన మా తమ్ముడు అన్నవరం శ్రీనివాస్, అందంగా డిటిపి చేసిన హరీష్ ఇంకా ఎందరో ఇది వెలువరించడంలో సహకరించారు. ఈ పుస్తకం వెలువడడానికి ఆర్థికంగా వెన్నుతట్టిన పది మంది మిత్రులకు ప్రత్యేక ఉద్యమాభినందనలు.

– సంపాదకుడు

# కవి .. కవిత.. కమ్మ..

# వీరులారా వందనం

- దరువు ఎల్లన్న
9966017333

పల్లవి : వీరులారా వందనం విద్యార్థి అమరులారా వందనం పాదాలకు
మా త్యాగ ధనులారా మరచిపోము మేము
గుండెల్లో గుడిగడుతం పోరూదండంబెడుతం ॥వీరులారా॥

చరణం1: కాకాతీయుల నుండి నిజాం రాజుల దాకా
తెలంగాణా ఘనత తెల్సుకున్నరు చరిత ॥2॥
ఆంధ్ర దోపిడి జూసి అగ్గిపిడుగూలైనా ॥వీరులారా॥

2 కాలేజిలో మండే నిప్పు కనికలు మీరూ
విద్యార్థి సంఘాల వీరాయోధులు మీరు ॥2॥
నెత్తూటి మడుగుల్లో ఎత్తింద్రు పిడికిల్లూ ॥వీరులారా॥

3 సదువుకోకొడుకాని సాగానంపిన తండ్రి
సదువుల్లో సారాన్ని ఇప్పిజెప్పినసారు ॥2॥
సావు వార్తా వింటూ గుండే పగిలిన తల్లి ॥వీరులారా॥

4 ప్రాపంచ చరితల్లో పరిశోధించిన గాని
మీలాంటి త్యాగాము యాడాగానారాదు ॥2॥
పాలాబుగ్గల పసిడీ మొగ్గాలు యాడుంద్రో ॥వీరులారా॥

5 మల్లేపువ్వుల్లారా మట్టి వాసనలారా
సేనుసెలకల్లారా గోరూవంకల్లారా ॥2॥
మీరన్నా జూసింద్రా బాలా కిషోరాలా ॥వీరులారా॥

6 పొద్దూపొడుపుల్లో మీ రూపుజూసుకుంటుం
పుస్తాకాలల్లో మీ పేరూ రాసూకుంటం ॥2॥
కన్నీల్లతో పదునూ కథలూ జప్పూకుంటం ॥వీరులారా॥

---

1975, బండలింగంపల్లి, ఎల్లారెడ్డిపేట.

# వీరులారా వందనం

- దరువు ఎల్లన్న
9966017333

పల్లవి : వీరులారా వందనం విద్యార్థి అమరులారా వందనం పాదాలకు
మా త్యాగ ధనులారా మరచీపోమూ మేమూ
గుండెల్లో గుడిగడుతం పోరూదండంబెడుతం ॥వీరులారా॥

చరణం 1: కాకాతీయుల నుండి నిజాం రాజుల దాకా
తెలంగాణా ఘనత తెల్సుకున్నరు చరిత ॥2॥
ఆంధ్ర దోపిడి జూసి అగ్గిపిడుగూలైనా ॥వీరులారా॥

2 కాలేజిలొ మండే నిప్పు కనికలు మీరూ
విద్యార్థి సంఘాల వీరాయోధులు మీరు ॥2॥
నెత్తూటీ మడుగుల్లో ఎత్తింద్రు పిడికిల్లూ ॥వీరులారా॥

3 సదువుకోకొడుకాని సాగానంపిన తండ్రి
సదువుల్లో సారాన్ని ఇప్పిజెప్పినసారు ॥2॥
సావు వార్తా వింటూ గుండే పగిలిన తల్లి ॥వీరులారా॥

4 ప్రాపంచ చరితల్లో పరిశోధించిన గాని
మీలాంటి త్యాగామూ యాడాగానారాదు ॥2॥
పాలాబుగ్గల పసిడీ మొగ్గాలు యాడుంద్రో ॥వీరులారా॥

5 మల్లేపువ్వుల్లారా మట్టి వాసనలారా
సేనుసెలకల్లారా గోరూవంకల్లారా ॥2॥
మీరన్నా జూసింద్రా బాలా కిషోరాలా ॥వీరులారా॥

6 పొద్దూపొడుపుల్లో మీ రూపుజూసుకుంటుం
పుస్తాకాలల్లో మీ పేరూ రాసూకుంటం ॥2॥
కన్నీల్లతో పదునూ కథలూ జప్పూకుంటం ॥వీరులారా॥

---

1975, బండలింగంపల్లి, ఎల్లారెడ్డిపేట.

# మా అవ్వే తెలంగాణా

- అల్లం వీరయ్య
9948481048

కొండకోనల వెండివెలుగుల
గిరుల సిరుల పైరునగలు
మొగులునంటిన కరుణమూర్తి
ముక్కోటి బిడ్డల కలలధాత్రి
మా అవ్వ గదరా తెలంగాణా
మా బువ్వ గదరా తెలంగాణా..
కోట్ల గొంతులు కలిసిపాడిన
ప్రత్యేక రాష్ట్రము కలలకోన
"మా అవ్వ"
గుట్టమీద చెట్టు కొమ్మన
గువ్వ పాడిన పాట పల్లవి
వాననిచ్చే కారుమబ్బులు
ఒరిసిమెరిసిన మెరుపు తల్లిది
గోదారికృష్ణ నదుల మధ్యన
పరుచుకున్న పంటచేనుర
గుండెనిండిన మాట తానై
గోరుముద్దలు కొసిరిపెట్టే
"మా అవ్వ"
పాలకంకుల జొన్న చేలు
తెలంగాణ తల్లి కరములమరు
తల్లిబిడ్డను ఎత్తినట్లుగ



మక్కపీసు తలను నిమురు
తామరాకులు కలువపూల
చెరువుదొరువులు నీటిసంపద
నా తల్లికేమి తక్కువాయెర
తలనువంచి మొక్కవేమిర
"మా అవ్వ"
కోస్త నుండి చుట్టరికము
కలుపుకొచ్చిరి మోసగాళ్ళు
సీమనుండి దిగిరి కొందరు
చింతలప్పుడె మొదలుకదరా
మద్రాసునిడిచిన శని ఇప్పుడు
మనల గట్టిగ పట్టుకున్నది
మాయమాటల మూటలల్లి
కొలువునెలువులు దోచినారు
నీటివనరులు మలిపినారు
నిండమనలను ముంచినారు
పావలర్ధకు భూమి దోచి
చేలు చెలుకలు చేతబట్టిరి
మనకంటిలో మన ఏలుబెట్టీ
వాడునింగికి ఎదిగినాడు
చెరనుబట్టిరి తెలంగాణ తల్లిని
అనాథలైతిమి నేలమీద
"మా అవ్వ"
తెలుగు తల్లి అమ్మగాదు
మము పెంచి పెద్ద చెయ్యలేదు
గామె మాకు అవ్వ అయితె
నల్లగొండ నాగమల్లి
గామె మాకు అవ్వే అయితె

పాలమూరూ పాలవెల్లి
మెదకు జిల్లా బతుకుమూరు
వరంగల్లు వెతలుతీరు
కరువుకాటకములు రెండు
కలిసి నమిలి మింగె గదరా
ఎటూ చూసిన ఎడారేను
ఎటు పారెను జీవనదులు
మా పాలివానికిది పాలవెల్లి
పగవానిదె ఆ తెలుగు తల్లి..
"మా అవ్వ"
తల్లి చెరను బాప బిడ్డల
తండ్లాట యేబదేండ్లదీ
అమరులైన బిడ్డల కొరకు
తల్లి శోకము యేబదేండ్లది
గుండెపగిలి తల్లడిల్లిన
పేరు పేరున పిలిచి తలిచే
"మా అవ్వ"
రావణా సమ్హారమునకు
రణము ఒకటే మిగిలినట్టు
చావో రేవో తేలెదాక
పోరాటమొక్కటె మార్గమున్నది
తెలంగాణ విముక్తి కొరకు
రండిరన్న లెండిరన్నా
కదం కదము కలిపి నడిచి
కదనరంగమున దుముకుదామూ...
మా అవ్వ గదరా తెలంగాణా
మా బువ్వ గదరా తెలంగాణా....

---

1956, గాజులపల్లి, మం॥ మంథని.



# బతకమ్మ - బతకమ్మా కోల్ !

- గర్శకుర్తి శ్యామల
94901 89081

బతకమ్మా - బతకమ్మా... కోల్
బంగారు బతకమ్మా ... కోల్
బంగారు బతకమ్మా ... కోల్
గౌరీ బతకమ్మా ... కోల్! ॥ బతకమ్మా - బతకమ్మా ॥

తెలంగాణం పుట్టిందీ ... కోల్
తెలంగాణల పెరిగిందీ ... కోల్
ఊరూరు తిరిగిందీ ... కోల్
ఊళ్ళన్ని నాయంది ... కోల్! ॥ బతకమ్మా - బతకమ్మా ॥

ఇల్లిల్లూ తిరిగిందీ ... కోల్
ఇంటింట్ల నిలిచిందీ ... కోల్
గడప గడప ఎక్కిందీ ... కోల్
గడపలన్ని దాటిందీ ... కోల్ ॥ బతకమ్మా – బతకమ్మా ॥

బతకమ్మ ఆటంటే ... కోల్
ఆడోల్ల పండుగంటా ... కోల్
చిన్న బతుకమ్మంటే ... కోల్
'చెల్లెలు – బొడ్డెమ్మా' ... కోల్
పెద్దబతకమ్మంటే ... కోల్
'అక్కా – బతకమ్మా' ... కోల్! ॥ బతకమ్మా – బతకమ్మా ॥

బొడ్డెమ్మను సాగనంపీ ... కోల్
పెత్రామాసనాడు ... కోల్
సంబరాలు సేయంగా ... కోల్
బతకమ్మ వస్తాదీ ... కోల్! ॥ బతకమ్మా – బతకమ్మా ॥

కన్నెల్లు – పడుచుల్లూ ... కోల్
ముసలీ ముదితలూ ... కోల్
తొమ్మిది దినమ్ములూ ... కోల్
దినమొక్క పండుగనే ... కోల్
మురిసి పోయి ఆడేటీ ... కోల్
బతకమ్మ ఆటంటా ... కోల్! ॥ బతకమ్మా – బతకమ్మా ॥

అడవంతా తిరిగి తిరిగీ... కోల్
తంగేడు పూలు దెచ్చీ ... కోల్
చేను, చెల్కల్ దిరిగీ ... కోల్
గునుగు పువ్వూ దెచ్చీ ... కోల్
గన్నేరు, దాసన్నా ... కోల్
తీరొక్క పూలు దెచ్చీ ... కోల్
బతకమ్మ సిగలోన ... కోల్
సింగారిత్తురంటా ... కోల్! ॥ బతకమ్మా – బతకమ్మా ॥



గుమ్మాడి ఆకుల్లూ ... కోల్
తీరా ఆకుల్లూ ... కోల్
ముచ్చటైన సిబ్బిలోనా ... కోల్
బతకమ్మను పేరుస్తర్ ... కోల్
తీరుతీరు సద్దుల్లూ ... కోల్
తీరైన సత్తుల్లూ ... కోల్
బతకమ్మకు అరగింపూ ... కోల్
పిల్లా – పాపలకూ ... కోల్
బతకమ్మ దీవెనలడిగీ ... కోల్
తొమ్మిదో దినానా ... కోల్
సద్దుల బతకమ్మనూ ... కోల్
సల్లంగ సాగనంపుతం ... కోల్! ॥ బతకమ్మా – బతకమ్మా ॥

భూమిపై జనమంతా ... కోల్
బతికినన్ని రోజులూ ... కోల్
సూర్యాడు, చంద్రూడు... కోల్
నిలిచినంత కాలమ్మా ... కోల్
వర్ధిల్లు బతకమ్మా ... కోల్
గౌరీ బతకమ్మా ... కోల్! ॥ బతకమ్మా – బతకమ్మా ॥

ఏటేట బతకమ్మా ... కోల్
పండుగ జరిపేట్టీ ... కోల్
తెలంగాణా బిడ్డల్లూ ... కోల్
తెలంగాణా రావాలంటూ ... కోల్
రాబోయే బతకమ్మనూ ... కోల్
పాటల్లో – ఆటల్లో ... కోల్
కొలుచుకుందాం చెల్లెలారా... కోల్
కోరుకుందాం అక్కలారా ... కోల్!

1948, వేములవాడ.

## తెగించి కొట్లాడుడే

-సి.హెచ్. రమణాచారి
9000820204

దంచుడే దంచుడే పొల్లు పొల్లు దంచుడే
తెలంగాణ ఇచ్చేదాగ లొల్లి జేసుడే
పంచుడే పంచుడే – మనది మనకు పంచుడే
తెలంగాణ వచ్చేదాగ – తెగించి కొట్లాడుడే ॥ దంచుడే ॥

పెద్ద మనుషులొప్పందాలు పేరుకైన రాకపాయె
ముల్కీ నిబంధనలు – ఇడిచిన ముల్లైపోయె
ఆరొందల పది జీవో – కుట్రలకు బలైపాయె
పాలకుల మాటలన్ని నీటి మీది రాతలాయె ॥ దంచుడే ॥

గోదావరి కృష్ణమ్మల నీళ్ళను తరలించినారు
మంజీర నీళ్ళనేమొ పట్నానికి పంపినారు
బొగ్గువాయె, ఉస్కెవాయె – రామగుండం కరంటువాయె
ఆదిలాబాదు అడివివాయె – ఖమ్మం గ్రానైటువాయె ॥ దంచుడే ॥

ఉన్నభూమి అమ్ముకొని కూలోల్లంమనమైతే
కన్న గడ్డ మీద మనకు బ్రతుకు దెరువు కరువాయె
జీవించే హక్కులను –కాలరాచి వేస్తున్నరు
తెలంగాణ గడ్డమీద – అడ్డ బిటాయించిండ్రు ॥ దంచుడే ॥

కరీంనగరు ఆదిలబాదు – కణకణకణ మండుతుంది
మెదకూ నిజాంబాదు – మెరుపులయ్యి మెరువంగ
ఖమ్మం ఓరూగల్లు – కన్నులెఱ్ఱ జేస్తున్నవి
పాలమూరు రంగారెడ్డి – పానమిస్తనంటున్నయ్
నల్లగొండ జిల్ల మరి – నగార మొగించంగా
హైదరాబాదు జిల్లంతా – అగ్గయ్యి మండుకుంట
చల్... తెలంగాణ దెస్తమని పోరుబాట లేస్తున్నవ్ ॥ దంచుడే ॥

---

1957, నర్సింహులపల్లి (కోట్ల), మం॥ గంగాధర.



## పోరు చరిత

- అల్లం కృష్ణవంశీ
9849374400

జై తెలంగాణాని ఉయ్యాలో,
బతుకు పోరుజెయ్యి ఉయ్యాల !
మా నీళ్ళు మాకోసం ఉయ్యాలో,
మా పోరుసాగంగ ఉయ్యాల !
మా జాగ మాకేనని ఉయ్యాలో,
జంగు సైరనూదినాము ఉయ్యాల !
ఇన్నేండ్ల తండ్లాట ఉయ్యాలో,
తెలంగాణ రావలే ఉయ్యాల !
నినదించి జనమంత ఉయ్యాలో,
నిరహార దీక్షలు ఉయ్యాల !
గొంతులో పొలికేకలు ఉయ్యాలో,
యుద్ధ నాదములాయే ఉయ్యాల !
ఆత్మ గౌరవము ఉయ్యాలో,
మేము గోరినాము ఉయ్యాల !
న్యాయపోరాటము ఉయ్యాలో,
నిప్పుల్ల మండింది ఉయ్యాల !
కాసోజు శ్రీకాంతు ఉయ్యాలో,
మండేటి సూర్యుడు ఉయ్యాల !
నిలువెల్లా మంటల్ల ఉయ్యాలో,
నినాదమిడవలే ఉయ్యాల !
బలిదానలెన్నున ఉయ్యాలో,
బతుకులు మారలె ఉయ్యాల !
మా కొలువు మాకంటే ఉయ్యాలో,
మమ్ముల కొట్టిరి ఉయ్యాల !
యూనివర్సిటిల్ల ఉయ్యాలో,
ఉద్యమించే బిడ్డలు ఉయ్యాల !

ఉద్యమాల సదువులు ఉయ్యాలో,
ఉగ్గుపాల బట్టె ఉయ్యాల !

ఓట్ల బిచ్చపోడు ఉయ్యాలో,
మా నోట్ల మన్నేసె ఉయ్యాల !

పానాలు పోతున్న ఉయ్యాలో,
పదవీకె అతికిరి ఉయ్యాల !

మంటల్ల మండిన ఉయ్యాలో,
మాటముచటలేదు ఉయ్యాల !

ప్రజాబంధువులు ఉయ్యాలో,
రాబందులనిపించే ఉయ్యాల !

నాలుక్కోట్లామంది ఉయ్యాలో,
నక్సలైట్లు అనె ఉయ్యాల !

నాదు స్వతంత్ర్య పోరాటం ఉయ్యాలో,
నక్సలైట్లే చెశిన్ల? ఉయ్యాల !

మా బతుకు మాకంటే ఉయ్యాలో,
తప్పెందుకయ్యింది? ఉయ్యాల !

కొలిమంటున్నంక ఉయ్యాలో,
కమిటీలు యేశిన్లు ఉయ్యాల !

కమిటీల పేరున ఉయ్యాలో,
కాలరాశె చూపు ఉయ్యాల !

అరచేతి అడ్డుతో ఉయ్యాలో,
సూరీడు ఆగునా? ఉయ్యాల !

ఒక్కొక్క కణమెల్లా ఉయ్యాలో,
రణభేరి మ్రోగిస్తం ఉయ్యాల !

తల్లడిల్లిన తల్లి ఉయ్యాలో,
కన్నీళ్ళు తుడుస్తం ఉయ్యాల !

నిలువెల్ల మాకండ్ల ఉయ్యాలో,
తెలంగాణ సూస్కుటం ఉయ్యాల....
జై తెలంగాణ! జై జై తెలంగాణ!!

1986, గాజులపల్లి, మంథని



## తెలంగాణ విజయగీతం - ముల్తోజు వీరబ్రహ్మాచార్యులు

9849419319

జయము నిచ్చు తల్లీ । మా తెలంగాణ తల్లీ
శుభము నిచ్చు తల్లీ । మా తెలంగాణ తల్లీ
జయహే జయహే । జననీ నీరాజనం
జయహే జయహే । జననీ నీ వారసులం ॥జయ॥
జయము తెలంగాణా । విజయమ్ము తెలంగాణా ॥జయ॥

అమరులైన తెలంగాణ । వీరుల కన్న భూమి
వీరవనిత రుద్రమ్మ । బతుకమ్మల కర్మభూమి
అడవి బిడ్డ పులి బిడ్డ । కొమురంభీముని గడ్డ ।
అడవితల్లి సమ్మక్క । సారలమ్మల పుణ్యభూమి ॥జయము॥

ఉద్యమాల పురిటిగడ్డ । పోతనదీ పోరుగడ్డ ।
కాళోజీ నినదించిన । తెలంగాణా కేక గడ్డ ।
కవి పండిత గాయకులే । గానం చేసిన గడ్డ ।
నరనరాన నీ నామమే । స్మరణయే మా ప్రాణం ॥జయము॥

భాగ్యనగర భాగ్యరేఖ । చార్మినారుగా మెరిసే
తెలంగాణా గడ్డకే । బొడ్డురాయిగా నిలిచే
వెలిగే నవాబుల । గోల్కొండ ఖిల్లా
వేల వేల కాంతుల । ఉప్పొంగిన చైతన్య ఖిల్లా ॥జయము॥

ఏకశిలా తోరణాలు । కాకతీయ వైభవాలు
సిరులొసగే సింగరేణి । బంగారు ఖనిజాలు
వేల వెలుగు విరజిమ్మే । యన్.టి.పి.సి. తోరణాలు
జల సంపద వన సంపద । దాచుకొన్న సోయగాలు ॥జయము॥

గల గల జారుతున్న గోదావరి । కృష్ణమ్మ మువ్వల సవ్వడులే ।
జల జల పారుతున్న । రామప్ప సాగరాలు
మా పచ్చని నేలల్లో । ముత్యాలై పారాలే
మా తెలంగాణా రాష్ట్రమంతా । స్వర్గమయం కావాలే ॥జయము॥

1965, పొట్యాల, రామగుండం.

## తెలంగాణ సాధనకై పోరుబాట

- బత్తిని రాజమల్లు
9959877968

పల్లవి : లేవరో తెలంగాణ అరె లేవరో తెలంగాణ – వీరులు విద్యార్థులంత ॥లేవరో॥
పోరుకు నిలబడి ఆంధ్రా.. పోకడేమొ చూద్దామా ॥లేవరో॥

చరణం 1: ఊరుమనది పేరుమనది ఊరు వనరులన్ని మనవి
నీరుమనది వారుమనది నిలువనీడ కూడ మనవి
పేరుకెమనమంత ఆంధ్రా.. పెత్తనాలు ఇక్కడేంది ॥లేవరో॥అరె॥

2. ఉగ్రులయ్యి నిలువండి.. ఆగ్రహోంబు బెంచండి
జాగ్రత్తగ జూడు డాంధ్ర జాదమనకు వద్దండి
భగ్గుభగ్గున మండీ.. భస్వము జేద్దాం పథా ॥లేవరో॥అరె॥

3. పిరికితనము వీడండి వీరులయ్యి నిలువండి
ఉరికి వురికి ఆంధ్రవాళ్ళ ఉరిమి తరిమి కొట్టండి
చెరుకు నరికినట్టు వాళ్ళా.. బెదలు బెదలు పెద్దాము ॥లేవరో॥అరె॥

4. తొడగొట్టి ఆంధ్రవాన్ని మెడబట్టి గెంటండి
గడగడగడ ఘర్జించే గండూ సింహ్మాలు గండి
తడబడక గాడ్ది కొడ్కులా.. త్తరిమి తరిమి కొట్టుదాము ॥లేవరో॥అరె॥

5. చెడ్డ లంజ కొడ్కులంత జేరిరి తెలంగాణలోన
గడ్డివాము దొంగ గొడ్డు గా మేసిన రీతి దినిరి
నడ్డి విరుగగొట్టి వాండ్లా... నడ్డంగ నరుకుదామూ ॥లేవరో॥అరె॥

6. అక్కలు చెల్లెండ్లు అమ్మ అమ్మమ్మ లంత లేండి
చక్కనియాకాళి దుర్గ శక్తులయ్యి నిలువండి
మక్కువతో జుట్లుబట్టి.. మక్కెలిరుగదందామూ.. ॥లేవరో॥అరె॥

7. రైతన్నలు తెలంగాణ రాష్ట్రముకై లేవండీ
విద్యార్థులు ఉద్యోగులు సిద్ధమయ్యి నడువండీ
గద్దరించి ఆంధ్రులనూ.. గుద్దిగుద్ది చంపుదామూ.. ॥లేవరో॥అరె॥

8. జబ్బ జరచి తొడగొట్టి అగ్గిపిడుగులవ్వండి
బొబ్బిలివలె లేవండి మబ్బులొదుల గొట్టండి
అబ్బా జై తెలంగాణా.. అనెదాక దంచామూ.. ॥లేవరో॥అరె॥

---

జాగిరిపల్లి, సైదాపూర్ మండలం.



## చావద్దు

- తుల సుధాకర్‌రావు
9849476286

తెలంగాణ బిడ్డ
ఇది వీరులను కన్నగడ్డ.
ధీరునిలా పోరాడు
భీరువులా చావద్దు.

చావద్దు చావద్దు
చచ్చి సాధించలేము.
పోరాటం పోరాటం
బ్రతుకన్నది పోరాటం.
ఆరాటం ఆరాటం
గెలుపు కొరకు ఆరాటం. ॥ తెలంగాణ ॥

ఆది మానవుని నుండి
అంతరిక్షం వరకు
సాగించిన ప్రయాణం.
సంఘర్షణతో కాదా
సాగర మథనాన ముందు
హాల హాలమే వచ్చెను.
అలుపెరుగని ప్రయత్నాన
అమృత ధారలు కురిసెను. ॥ తెలంగాణ ॥

నేలను ఎదిరించి పెరిగె
అంకురపు పోరాటం.

నింగిని చీల్చుకు సాగే
వాన చినుకు పోరాటం.
కదులుతున్న చక్రం
గమ్యంకై పోరాటం.
గిరులు తరులు
ఝరులు నరులు
జగమంతా పోరాటం
పోరాటం లేని చోటు లేదు ఈ లోకంలో ॥ తెలంగాణ ॥

కండలు తిరిగిన దేహం
ధైర్యం నిండిన గుండెలు
దేనికైన వెనుకాడని
తెగువ ఒకటి చాలదు
వజ్రతుల్యమైన హృదయం.
ఉండాలి యువతకు ॥ తెలంగాణ ॥

కణ కణ కణ కణ
కణ కణ రగిలే నిప్పు కణికలై లేవండి.
భగ భగ భగ భగ
భగ భగ మండే అగ్నిగుండమై కదలండి.
అరచేతిన తుఫానును అదిమిపట్టి చూపండి.
ఆ నిప్పును ఆ రవ్వను
ఆ వేడిని ఆ వాడిని
నిలుపుకొని సాగండి. ॥ తెలంగాణ ॥

(తెలంగాణ సాధనకై నమ్మకంతో పోరాడుతున్న నా సహోదరులకు అంకితం – ఈ పాటతో ఒక్క చావైనా ఆగాలన్నది నా కోరిక)

---

1973, మూర్‌మూర్, రామగుండం.



# జయహో తెలంగాణ

- ఆడెపు నారాయణ
9392554794

జై కొట్టి తొడగొట్టి జై తెలంగాణంటు
గర్జించి, గాండ్రించి గండభేరుండమై
రక్తాన్ని చిందించి, రణభేరి మ్రోగించు
లేవరా తెలుగోడ ! మా తెలంగాణంటు
మీ డొక్కలే నిండే! మా డొక్కలే ఎండెరా
అన్నింటపైచేయి అంది పుచ్చుకొంటు
అణగద్రొక్కారు మమ్మధికార బలముతో
మానేల జలమంతా, మీ నేల పాలాయెరా
నిండు బావులు మీకు, ఎండమావులు మాకు
నీరేమో మీదాయెరా ఓరి ఆంధ్రోడా !
బీడేమో మాదాయెరా ! ఆంధ్రోడా !
మా కళాశాలల్లో మీ సీటు ముందాయె
మా తెలంగాణలో మీ కొలువు ముందాయె
మా కొలువు వెనుకాయెరా !
మా భూములన్ని గొని మమ్ముపేదగ మార్చి
మా భూములన్నమ్ముచు మీ జోలె నింపుచు
మా తెలంగాణలో ఖిల్లాలు కడుతుంద్రు
మా వనరులన్ని కొల్లగొడుతున్నారు
మా అభివృద్ధిలో అడ్డు పడుతున్నారు
ఆంధ్రోడ ! పొమ్మంటు తరిమి తరిమీ కొట్టు
వలన అధికారాన్ని వదిలించుకొనుటకై !
స్వయంపాలనకయ్యి సాగి ముందుకు రండిరా !
తెలంగాణ పోరుకు తరలి తరలి రండిరా !

---

సిరిసిల్ల.

# తెలంగాణ మా ధ్యేయం

- సబ్బని బాలయ్య
9701909295

తెలంగాణా పోరులో
అమరులైన వీరయోధులకు జోహార్లు
ప్రాణాలను తృణప్రాయంగా అర్పించి
పోరులో ఒరిగిన త్యాగమూర్తులకు జోహార్లు
పాలనలో, పదవులలో, రక్షణలో
విద్యా, వైద్యం, నీరు, కరంటు, వనరులు
దొంగిలించి, దోపిడి చేస్తూ, దర్జా దొరలై
కోట్లను గడించి పార్టీలను, పదవులను ఏలుచున్నారు
వివక్షపాలన, నిరంకుశ చట్టాలను తెచ్చి
కుటిల కుతంత్రాల రాజకీయం చేస్తూ
తెలంగాణావాదాన్ని అనగద్రొక్కుతూ
అడ్డుపడిన సమైక్యవాదానికి సవాల్.
ప్రతి గుండె నిండా మండుతోంది తెలంగాణా.
ప్రతి పల్లెలో జ్వలించింది తెలంగాణా.
పట్టణాలలో ప్రళయమైంది తెలంగాణా.
ధర్నాలు, ర్యాలీలు, దీక్షలు, ఉద్యమాలతో
మరో స్వతంత్ర్య సంగ్రామంగా మారుతోంది
యువరక్తం ఉద్రేకంతో ఊగిపోతున్నది
విద్యార్థిలోకం ఊపిరి ఉన్నంతవరకు పోరుకు సై అంటోంది
మహిళాలోకం మరో ఝాన్సీ, రుద్రమలై
ఉద్యమానికి ఊపిరి పోస్తున్నారు
ఉద్యోగులు సైతం తెలంగాణా కొరకు తెగువ చూపుతున్నారు.
పార్టీలన్ని ఏకమై ఐక్యకార్యచరణ సంస్థగా ఉండి
ఢిల్లీ పీఠాన్ని కదిలించింది మహా ఉప్పెనగా
ఈ మహాయజ్ఞంలో సమైక్యవాదం
నశించి సమసిపోవడం ఖాయం
మా నాలుగు కోట్ల ప్రజాభీష్టం
తెలంగాణా రాష్ట్రమై ఏర్పడుట సత్యం.

---

1951, సిరిసిల్ల.



# బతుకు బాట

- కాట్నపల్లి సత్యనారాయణ శర్మ
9866834739

ప : రాజన్న సూసినవా సర్కారు వాన పడ్డ దున్నపోతులాగున్నాది ॥2॥
వానేగదా అని మరి ఊరుకుంటేను మారాష్ట్రము మాకు ఇవ్వకుండుటేను
ఉరుములాగా ఉరిమి పిడిగులై పడతాము
తూఫానులా లేచి తుంగలో తొక్కుతం ॥రాజన్న॥

చ : బడులు బందు జేసి బాజారు కొచ్చింద్రు
కాలేజి బంజేసి కమిటీలు పెట్టింద్రు
రోడ్డుపై పరీక్ష రాయనే రాసింద్రు
రాష్ట్రాన్ని కోరుతూ ప్రాణాలే ఇచ్చింద్రు
ఇంకెప్పుడిస్తారు రా మా రాష్ట్రం - ఇవ్వకుంటే పెట్టుడే మీ కాష్టం॥రాజన్న॥

చ : ఆఫీసులూ అన్ని అగమాగం చేసి
పెన్ను కింద పెట్టి పనులు పక్కకు నెట్టి
ధర్నాలు జేసింద్రు దీక్షలే పూనింద్రు
ఉద్యోగాలు మాని ఉద్యమిస్తున్నారు.
ఇంకెప్పుడిస్తారు రా మా రాష్ట్రం - ఇవ్వకుంటే పెట్టుడే మీ కాష్టం॥రాజన్న॥

చ : రోడ్డుపై చాకలి బట్టలే ఉతికిండు
మంగలి వాండ్లేమొ గడ్డాలు గీసింద్రు
పద్మశాలీలొచ్చి మగ్గాలు దెచ్చింద్రు
రోడ్డు మీద పెట్టి బట్టలే నేసింద్రు
ఇంకెప్పుడిస్తారు రా మా రాష్ట్రం - ఇవ్వకుంటే పెట్టుడే మీ కాష్టం॥రాజన్న॥

చ : షాపులు బస్సులు స్కూళ్ళు కాలేజీలు
బ్యాంకులు, బంకులు బంజేసే సొంతంగ
రోడ్ల మీద వంట వార్పులే జేసింద్రు
బతుకు బాగు కోరి బాటనే పట్టింద్రు
ఇంకెప్పుడిస్తారు రా మా రాష్ట్రం - ఇవ్వకుంటే పెట్టుడే మీ కాష్టం॥రాజన్న॥

చ : కాలయాపన జేసే కమిటీలు మాకొద్దు
కల్లిబొల్లి కబురు మాకాడ చెప్పొద్దు
దోపిడి జరిపేటి ఆంధ్రాతో పొత్తొద్దు
మా తెలంగాణంటే మా అందరికి ముద్దు ॥రాజన్న॥

---

1970, ఎండపల్లి, వెల్గటూర్ మండలం.

## దీవెనలు

- డింగరి రామాచార్య
9440357742

తెలంగాణ సోదరా
తేరిపార జూడరా
శత్రుమూకను తరిమికొట్టి
తెలంగాణ నేలరా || తెలం ||

తెలంగాణ సోదరీ ।
రుద్రమసమాగ్రేసరీ ।
క్రూరాంధక పాలననే
చిమ్మి చిమ్మి గొట్టుమీ ।
మన నీటిని – మన వనరుల
మన భూమి ఖనిజాలను
మనకే విధి నియమించెను–
చీకటి ప్రభుత నెదిరించే
తెలంగాణమును సాధించుడీ । || తెలం ||

వేములవాడ రాజన్నా
ఐలోని ఐలన్నా
కొంరెల్లి మల్లన్నా



కొత్తకొండ వీరన్నా
ధర్మపురి నరసింగన్నా
భద్రగిరి రామన్నా
కొండగట్టు అంజన్నా
కాళేశ్వరం కాళన్నా
యాదగిరి నరసన్నా
నాంపెల్లి నరహరీ
ఇల్లెందకుంట రామగిరీ
ఇలవేల్పుల కొలువుదీర (దీవెనలతో)
యువతీ యువకులంతా
తెలంగాణ నేలుండీ || తెలం ||

ఏడబోయె మన కుంటలు – ఏడబోయె మన ఒట్టెలు
ఏడబోయె నీటి అలుకులు–ఏడబోయె మన ఆవులు
ఏడబోయె వరిఏన్నా – ఏడబోయె చెఱకు గన్నా ।
ఏడబోయె పసుపు మిసిమి – ఏడబోయె మిరపతోట
ఏడబోయె జొన్న కంకులు – ఏడబోయె పెంకుటిండ్లు
ఏడబోయె మన గిత్తలు – ఏడబోయె మన బక్కులు
రైతన్న రెక్కలు రిత్తబోయె పల్లె పట్టులన్ని బీడువోయె
బూర్జువాల బూజు దులిపి
అక్రమ భూకామందుల – అణగదొక్కి
ఫాక్షనిస్టుల పాతిపెట్టి
రియలెస్టేటుల పీచమణచి
దొంగమచ్చుల నడి దళారీ
దగాకోరుల కోరలూడ్చి
తెలంగాణ తల్లి దీవెనలతో
తెలంగాణ నేలండీ || తెలం ||

1949, కోరుట్ల.

## తెలం'గానం'

- మందల రవీందర్‌రెడ్డి
9704202122

మణులున్నా, గనులున్నా - మాగాణి ।
వనులున్నా, నదులున్నా - పూబోణి ॥2॥
తెలంగాణ అవని - తెలంగాణ జనని ॥2॥ ॥మ॥

మా బాట ప్రగతి బాట - మా మాట కంచుగంట ॥2॥
మా పదము జానపదము - కోకిలమ్మ కూత విధము ॥2॥

ఐనా....
తంత్రి తెగిన వీణ - మా తెలంగాణ
కుతంత్రాలకు బలియయ్యె - మా తెలంగాణ ॥2॥
బాధగాధల మయం - జనజీవనం ।
పుట్టినట్టి గడ్డపైనే - పరాయిలం - మేం బానిసలం ॥2॥

మా యాసకు, మా బాసను - వెక్కిరించి, కొక్కిరించి ॥
ఆశలపై నీళ్ళు జోసి - ఆవేశపరుల జేసి ॥2॥
పనికిరాని వారలని - ప్రచారాన్ని జేసినట్టి ॥2॥

తెలంగాణ ద్రోహులార - తొలగండని గర్జిస్తూ...

గొంతు గొంతు కలిపి - మూడు కోట్ల జనం ।
మారుమ్రోగనినదింతుము - ఈ గానం ॥2॥
ప్రత్యేక తెలంగాణం - ప్రత్యేక రాష్ట్ర గానం ॥2॥
జై తెలంగాణ । జై జై తెలంగాణ ॥2॥

1966, కేశన్నపల్లి, ముత్తారం (మంథని)



## జై తెలంగాణ

- నడిమెట్ల రామయ్య
8106657657

పల్లవి : సోనియమ్మ జన్మదినము పండుగనాడు
తెలంగాణ ప్రక్రియ మొదలైందంటు
చిటికేస్తు చిదంబరం చిరునవ్వుతో చెప్పిండు
కేసిఆర్ దీక్షను విరమింప జేసిండు
జై తెలంగాణ జై అనవ తెలంగాణ
మన హక్కు తెలంగాణ ప్రజల పసిడి తెలంగాణ

చరణం : సై అంటు తలలూపి తలకాయ లేనోళ్ళు
సమైక్యాంధ్రా అంటు తలలు బాదుకొంటున్నరు
పెద్ద మనుషులు ఎప్పుడు మాట దప్పబోరు
మాట తప్పిన వాళ్లు బ్రతికిన చచ్చినోళ్ళు ॥జై తెలంగాణ॥

చరణం : తెలంగాణ పదమును విడువక పాడినావు
శమధమ నియమంబుల స్నేహం జేసినావు
ఆత్మ బలిదానమునకు వెరువలేవు నీవు
దశాబ్దాల ఉద్యమాన్ని దరికి చేర్చినావు ॥జై తెలంగాణ॥

చరణం : పార్టీలకతీతంగ అందరమొకటైనాము
తెలంగాణ సాధించె వరకు నిదురబోము
తెలంగాణ ప్రజల గుండెలలోన నిలుస్తావు
తెలంగాణ గాంధీ యంటు కేసిఆర్‌ను పిలుస్తాము ॥జై తెలంగాణ॥

1946, వల్లంపహాడ్.

## జై తెలంగాణతల్లి

- వాసరవేణి పరశురాం
9492193437

పల్లవి : జై తెలంగాణ తల్లి జయం తెలంగాణము
నీ కొడుకుల బిడ్డల నిండు నీరాజనము
బంతిపూల దండలల్లి నీ మెడలో ఏసెదము ॥2॥
బంగారు పాటలల్లి నిన్ను కీర్తించెదము ॥జై తెలంగాణ తల్లి॥

చరణం1: గోదావరి కృష్ణమ్మల గలగలా మువ్వలు
మంజీర మానేరుల కిలకిలానవ్వులు
రాజన్న రామన్న నర్సన్న దేవతలు ॥2॥
ఎల్లమ్మ మైసమ్మ పోశమ్మ శక్తులు ॥జై తెలంగాణ తల్లి॥

2 శాతవాహన కాకతీయ నవాబుల చరితలు
శ్రీముఖ అరికేసరి గణపతుల కీర్తులు
ఓరుగల్లు గోలుకొండ ఎలగందల ఘనతలు ॥2॥
రుద్రమ్మ సమ్మక్క సారక్క శక్తులు ॥జై తెలంగాణ తల్లి॥

3 పాపన్న కొమురయ్య కొమురం భీం వీరులు
ఐలమ్మ స్వరాజ్యం కమలమ్మ నారులు
సోమన పోతన కాళోజీ దాశరథులు ॥2॥
బతుకమ్మ బోనాల పీరీల పండుగలు ॥జై తెలంగాణ తల్లి॥

4 తంగేడు గోరింట గుణుగు బంతిపూలు
పాలపిట్ట గోరెంక కోయిల నెమలులు
మక్కజొన్న కంకులు మలీద రొట్టెలు ॥2॥
సిర్రగోనె కోలాటం ఆలువ ఆటలు ॥జై తెలంగాణ తల్లి॥

---

1975, గ్రా॥ సింగారం, ఎల్లారెడ్డిపేట మండలం.



## లేవరా !

- ఇష్రత్ సుల్తానా
9440739159

తెలంగాణ వీర లేవరా
దీక్షబూని సాగరా
తెలంగాణ స్వేచ్ఛకోరి
తిరుగుబాటు చేయరా

దారుణ ఆత్మహత్యలతో తల్లడిల్ల వద్దురా
నీతిలేని శాసనాలు నేటినుండి రద్దురా
అదరవద్దు బెదరవద్దు
తెలంగాణ పద్దురా
తెలంగాణ హద్దురా

ఎవడువాడు ఎచటివాడు
ఇటువచ్చిన ఆంధ్రవాడు
భూబలం కొండఫలం
కబళించే దుండగీడు
జలధనం వనరు ధనం
దోచుకునే దొంగవాడు

ఎవడువాడు ఎచటివాడు
ఇటువచ్చిన మద్రాసీ వాడు
తగిన శాస్తి చేయరా
తరిమి తరిమి కొట్టరా ॥ తెలంగాణ వీర॥

ఈ తెలంగాణ ఈ హైదరాబాదు
'మాదే' అని చాటి చెప్పి
ప్రతి ఆంధ్రోనికి బుద్ధి చెప్పి
కలుపు మొక్కల పెరికి వేసి
పరాన్న భుక్కుల గేదిమేసి
సింహాలై గర్జించాలి
తెలంగాణ సాధించాలి ॥ తెలంగాణ వీర ॥
ఆంగ్లేయుల పాలన నుండి
ఆంధ్రుల పాలనలో పడ్డామని
అణచివేత దోపిడీకి గురయ్యామని
గొంతెత్తి చాటరా
తిరుగుబాటు చేయరా

నిదురించిన పౌరుషాగ్ని రగిలించి
ప్రచండ భానుడై నిరంకుశత్వాన్ని మసి చేసి
ఆత్మ గౌరవంబుతోడ
నిర్భయముగ, నిశ్చయముగ
తెలంగాణ పాలిద్దాం.

శ్రీ కృష్ణ కమిటీలు మనకొద్దు
తెలంగాణ మనకు ముద్దు
జనన మరణాలంత సత్యం
తెలంగాణ సాధించడమంత నిత్యం
అని ఎలుగెత్తి చాటరా
"జై తెలంగాణ జై జై తెలంగాణ"

1957, కరీంనగర్.



# పోరాటం

-డా॥ బొద్దుల లక్ష్మయ్య
9985004912

పల్లె పల్లెలో నిరసన వెల్లువలను
చూడ ముచ్చటగా తోచు చుండెనేమి?
ఎంత కాలము గుప్పిట నుంతువయ్య
ఓ చిదంబరామాత్య యింకోర్చుటేల ?

ఎముక లేని నాల్క యేమైన పలుకును
దోస మెంచ గలడె మోసకారి
నిప్పు వంటి నిజము చప్పున జల్లార్చు
శ్రద్ధ తోడ వినుము శంకరప్ప

చెలిమి చేసి చేసి చెడిపోయినామని
గుట్టురట్టు జేయ పట్టుబట్టి
పొత్తు వదలమనుచు పోరాటమేలరా?
శ్రద్ధ తోడ వినుము శంకరప్ప

ఎక్కడ వేసిన గొంగడి
యక్కడనే యున్నదనుచు నాందోళనలో
చిక్కినదీ తెలంగాణము
మొక్కిన హస్తినకు మెఱలు ముట్టవదేలా?

ఆత్మహత్యలున్ మరి గుండె లాగిపోయె
మనసు మనసులో లేక మా మనుషులంత
తల్లడిల్లిన ఢిల్లీకి ఢిల్లగి వలె
తోచెనా యేమి ? మరి మరి చూచుచుండె

1947, తెలుకుంట, జూలపల్లి మండలము

# సవాల్

- మాటెంకి రవీంద్ర
9491533295

"Know Thy Self"
నువద్దే
నన్ను నేను తెల్సుకున్న
నువ్వెవరో పోల్చుకున్న
ఇగ నువ్వు
నన్నేమార్చలేవు ఏమిమార్చలేవు
నా మార్గంలో నీ దుర్మార్గపు తల దూర్చలేవు
నా స్వప్న దుర్గాన్ని కదల్చలేవు
మనసావాచా 'విభజన రేఖ' స్పష్టమయ్యాక
సమతలేని సమైక్య భజనెందుకు కర్మణా
నా ఖర్మగాక!
జాగృతమైన
జాగ్రత్త పడుతున్నా
ఉద్యమ సూరీన్ని ముద్దాడుతున్నా
గమ్యం పాదాక్రాంతమయ్యే దాకా
కదం తొక్కుతున్న నా పాదాలాగిపోవు
పదమెత్తుకున్న నా పెదాలు మూగబోవు

వక్రభాష్యాల శుక్రాచార్యుల
చక్రబంధనాలు తెంచుకొని
పేట్రేగుతున్న రాజకీయ దార్తరాష్ట్రుల
కుట్రల చట్రాల్లోంచి బయటపడి
నా చరిత్ర నేడు
తనను తాను పునర్నిర్వచించుకుంటోంది
తమవణువణువునూ పునర్లిఖించుకొని
సరికొత్త పొత్తంగా ఆవిష్కరించుకుంటోంది.

'అందని ద్రాక్ష పుల్లన' అనుకొని
మూడ్రోజులకే తోక ముడ్చుకొని
పారిపోవడం కాదురా దీక్షంటే



మూడేళ్ళ పాప నుండి మూడు కాళ్ళ ముసలి దాకా
కళ్ళలో వత్తులేసుకొని వెలుగుతున్న రేపటి కాంక్ష!
ప్రతి కూడలిలోనూ నిరశన దీక్షా శిబిరమై సాగుతున్న ప్రతీక్ష!!

ఉనికి కోసం ఊరూరా ఊరేగడం
పదవి కోసం పదిమందినీ పోగేసి
పోగేయడం కాదురా ఉద్యమమంటే-
గల్లిగల్లిలో గజ్జెకట్టి ఆడుతున్న ఊపిరి పాట
పల్లెపల్లెలో లదాయంటూ తొడగొడుతున్న 'ధూంధాం' ఆట

ఇక్కడ
త్యాగమంటే తనను తాను సమిధగా
సమర్పించుకొనే నిర్విరామ యాగం!
నిలువెత్తు మనిషి నిలువునా
నిప్పుకణమై మాడటమంటే మాటలా?

కాలాన్ని 'కమిటీ'ల కప్పగించి
గాలమేశామనో తాళమేశామనో
కళ్ళెమేశామనో గొళ్ళెమేశామనో
కళ్ళెగరేసి కాలరెగరేసి
సంబరపడితే మీరు పోవచ్చు గాక-

సమరమంటూ మొదలు పెట్టాక
తుద ముట్టేదాకా మడమ తిప్పనోల్లం మేం
ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసిపడే
ఉడుకు నెత్తుటి ఉప్పెనైన చోట
ఉద్యమం ప్రచండ ప్రభంజనమై చెలరేగే
ప్రజల శ్వాసైన చోట
పోరాటాల పురుటిగడ్డ మీద కలబడి
త్యాగాల వధ్యశిల మీద నిలబడి
సవాల్ చేస్తున్నా

ఐదు దశాబ్దాల వల అంతరిస్తుంది.
మా ఆకుపచ్చని కల అంకురిస్తుంది.
"Dream can be Come True"

---

1974, కొత్తపల్లి, భీందేవరపల్లి మండలం.

## డిక్లేరేషన్ ఆఫ్ తెలంగాణా

- కురిమిండ్ల స్పృజన
8106537096

మా ప్రాంతం
ఒక రాష్ట్రం కాదురా పిల్లగా!
మా రాష్ట్రం ఒక దేశంరా అబ్బిగా!
మీది రెండున్నర వ్యవహారం
కులభాషాధిపత్య దౌర్జన్యం.

తెలంగాణమంటే ఏమనుకుంటున్నరు
తెలింగిణ తల్లి దీవెనార్తుల
పైరు పచ్చని మాగాణం.
తిరుగుబాటు ఎర్రపూలవనం
యాసభాషల జీవావరణం..
ఇటేటు రమ్మని ఇల్లప్పగిస్తే
దొంగల తీరు ఉన్నదంత ఊడ్చుకపోతిరి.

అబ్బ ఎంత మోసం జేస్తిరి పిల్లగా!
మీ ప్రాంతాన దళితులను
మనుషులుగ చూడని మీరు
అన్నదమ్ములం మనమని
సన్నాయిరాగాలు తీసుకుంట
బుజ్జగిస్తున్నరు ఇకమతులబడుతున్నరు.

యాభై ఏండ్ల పబ్బతి మాది
ఎవరిచ్చేది ఏంది పిల్లగా
తెలంగాణా వీరభూమి మాది
నాలుగు కోట్ల మంది తీర్మానించిన
వేరు తెలంగాణ ఇది.
గిదే మా డిక్లేరేషన్ ఆఫ్ తెలంగాణా
రెండో మాట లేదు తిరుగు లేదు
మా తొవ్వపువ్వుల సాక్షిగా
కలిసుండుడు కల్ల విడిపోవుడే మేలు మల్ల.

1986, శ్రీరాములపేట, వీణవంక మండలం.



## నకరాల్జేత్తె ఈబ్బలుగుద్ది...!!

- దేవి యాదగిరి
9866069159

నా బతుకు నాక్కావాలె
నా ఉనికి నాక్కావాలె
నామీద స్వారీ చేసుటానికి
నేను నీ గుర్రాన్ని కాదు
నన్ను కోసి కూరండుకోనీకి
నేను నీ గొర్రెను కాను
నాకు చదువుంది సంస్కారముంది
నాకు సమస్త సత్తువలు వున్నై
సాహస చరిత్ర నాది
శత సహస్ర మెదళ్ళు నా సొంతం
ఆ మెదళ్ళకు ఇకమతులు తెలుసు
అనివార్యమైతే కత్తి దూసుడు తెలుసు
ఈ నేల నా సొంతం
ఈ నేలమీది వనరులు నా సొంతం
ఇక్కడ అన్నమున్నది ఔషదాలున్నై
నాకు సేద్యం శాతనైతది
నలుగురికి పెట్టుడు శాతనైతది
దానం నా ఇంటి గుణం
దాచుకొనుడు నాకు శాతకాదు
నాగరికత నా జీవితంలో భాగం
నాకు మోసం తెల్వది కపటం తెల్వది
కాళ్ళల్ల కట్టె పెట్టుడు అసలె తెల్వది
నీళ్ళు అమ్ముకునుడు నాకు శాతకాదు
చల్లతో వ్యాపారం దొల్లతనం
దేవుడు మాకు బొగ్గిచ్చిండు
అడవులిచ్చిండు ఆటవిక సంపదలిచ్చిండు
నదులిచ్చిండు నాగరికతలిచ్చిండు
నువ్వు దేహీ అని దేబిరిస్తే

పనులిచ్చిన పావురంకొద్ది చూసిన
తిష్ట వేసుడు దోచుకునుడు
కొనసాగిస్తనంటే నేనూకుండ
నా ప్రాంత నిధులతో
పదికోట్ల మందిని పోషిస్తా
నీకు మాత్రం బొక్క విదిలించ
నాకు విశ్వాసం చూపిస్తే
సర్వస్వం ధారపోస్తా
నన్ను మోసం చెయ్యాలని చూస్తే
నాలుక తెగ్గోస్తా
వేషాలేసుడు మోసాలు చేసుడు
నీ పుర్రె గుణం
నా సొమ్ము తిన్నందుకు
నిన్ను నా తమ్ముడనుకున్నా
నా పంచన చేరినందుకు
పాపం పోనీలే అని ఊకున్న
బతుకటానికచ్చినవని జాలి చూపిన
నేను సముద్రాన్ని నువ్వు ఓడవు
ఓడ పెత్తనము బోడ పెత్తనము
దాన్ని సముద్రము సహించదు
నిన్ను నేను పిలవ లేదు
నీ పెత్తనం నాకక్కర్లేదు
నేను ఉగ్రరూపం ఎత్తక ముందే
వాస్తవం తెలుసుకో పక్కకు తప్పుకో
యాదగిరి నర్సిమ్మ సామి
కొత్తకొండీరన్న, కొండగట్టంజన్న
కొంరెల్లి మల్లన్న, మేడారం సమ్మక్క
గీళ్ళంతా నీ అంతు చూడకమునుపే
ఎములాడ రాజన్న కాళ్ళ మీద పడు
అయ్యా అప్పా అని పడుండు
లేకుంటే పీరో పీరో అని పీకు....!!

1954, ధర్మారం మండలం.



# ఆత్మగౌరవ శిబిరం

- జూకంటి జగన్నాథం
9441078095

ప్రజల కల అణచివేస్తున్న దగ్గర
ప్రాంతం జనం అలల్లా కదులుతున్న చోట
శిబిరాలుగా వెలయడం కొత్తకాదు.
శిఖరాలుగా కలయడం కొత్తకాదు.

ఏ వైపు నిలుచున్నామన్నదే ముఖ్యం.
ఏ దిక్కు బాణం ఎక్కుపెట్టామన్నదే సఖ్యం.

ఇప్పుడు వలపన్నిన శిబిరం పేరు
ఆత్మగౌరవం అందాం.
ఇప్పుడు కలగన్న శిబిరం నామం
హక్కుల సాధన అందాం.

ఒక్కొక్కసారి ఎవరి కడుపులు కాలపెట్టలేక
తన కడుపును తానే మాడ్చుకునే
ఇమాన్‌దారీ రితె నిరాహారదీక్ష శిబిరం అవుతుంది.
మరోసారి రేపటి నిరసన కార్యాచరణకు
వ్యూహరచన చేసే సచివాలయం అవుతుంది.

రోడ్ల పాదముద్రలతో
పోటెత్తి పొంగిపొర్లుతుంటాయి.
రోడ్లు అట్టడుగు ప్రజల
ఉద్యమ చలన సంగీతమవుతుంటాయి.
తొవ్వలు అట్టడుగు ప్రజల
ఉద్యమ చలన సంగీతమవుతుంటాయి.
అడ్డంగా కూర్చుంటే రాస్తారోకో
లక్షల అడుగులు కదిలితే ర్యాలీ
ఆగి అగ్గిలా పాటెత్తుకోవడం ధర్నా
ప్రతి మనిషీ నినాదమై నిలువెల్లా పులకించిపోతాడు
ప్రతి చేయి బిగిసిన పిడికిలై విద్యుత్తుగా పరవశించిపోతుంది.

'ఆవాజ్ దో! హమ్ ఏక్ హై !'
'వీరులారా మీకు వందనం
విద్యార్థులారా మీకు వందనం'

ఇప్పుడు తెలంగాణలోని
ప్రతి ఇల్లూ ఒక శిబిరం ఒక కరపత్రం
ప్రతి పల్లే ఒక నిలువెత్తు నినాదం
ప్రతి మనిషీ ఒక సంగ్రామ స్మారక స్థూపం
వంటింట్లోనే కాదు
వంట రోడ్ల మీద కూడా వండుకోవచ్చు.
ఊరు ఊరంతటికీ తాళం వేసి
రోడ్డు మీద అప్పటికప్పుడు ప్రదర్శనగా మోహరించవచ్చు.
కోలాటమై బతుకమ్మై భాసించవచ్చు.

ఇప్పుడు ఒకే ఒక్క పాట
ఇప్పుడు ఒకే ఒక్క మాట
'జై తెలంగాణ ! జై జై తెలంగాణ !!

శిబిరాలుగా విడిపోవడం కొత్తకాదు.
శిఖరాలుగా తలెత్తడం కొత్తకాదు.

ఈ మన్నుకు ఏదో మహత్తు వుంది.
ఈ మనుషుల్లో ఏదో విద్యుత్తు దాగి వుంది.
బతుకును కొనగోటితో విసిరేసి
కాలరెగియేడం మామూలు విషయం కానేరదు.

ఇప్పుడు మోహరించిన రాస్తారోకో పేరు
పట్టపగలు కాలబెట్టుకున్న శ్రీకాంత్ అందాం.
ఇప్పుడు వలపన్నిన ధర్నా పేరు
జై తెలంగాణ అంటూ
రైల్లోంచి అమాంతం దుంకిన అమర విద్యార్థి అందాం.
ఇప్పుడు కొలువుతీరిన మహా మానవహారం పేరు
మరణించిన వీరుని సూసైడ్ నోట్ అందాం.

ఇప్పుడు ఉద్యమం పెద్దగై
నాయకులు పొట్టిగై పోయారు.

---

1956, తంగళ్ళపల్లి, సిరిసిల్ల.



# బుడతకీచు

- ఆర్క్యూబ్
9848625060

భారత భాగవతాదుల
ఇంటి పేరు – ఆంధ్ర
ట్యాంక్‌బండ్‌ను సగర్వంగ ఎత్తి
"హుస్సేన్" సాగరమే చెబుతుంది మా ఘనత

భూపటల కదలిక సిద్ధాంతమే తేల్చి చెప్పె
ఇక్కడి విజయవాడే అక్కడి వేములవాడ
కుప్పమే – కోటిలింగాల

డి॥9 తర్వాత ఈ "రెండు కళ్ళ-సాక్షి" గా
'దీక్ష'గా తప్పిన తప్పకాలనేకం
మచ్చుకొకటి..

"తెలంగిన్ – టాలింబన్
టుగ్రేబాజ్‌ఖాన్-అప్పకిస్టాన్"
(నోస్ట్రడామస్ 3వ సంపుటి)

ఆ పదాల ప్రాసా యాసా యతి మైత్రి..
నేను మొదట్నించి చెబుతున్నదదే

1956-1969-2009
ఆ మూడు మాకు మేమిచ్చుకున్న పరమవీర చక్రలు
నోబెల్ శాంతి బహుమతి తృటిలో తప్పిన సందర్భాలు
ప్రాజెక్టు-ఫ్యాక్టరీ-పత్రిక ప్రతొక్కటి రాంకీ టు కల్కీ
అన్ని జోన్లను పెనవేసుకున్న గుంటూరు -పల్లె
అధ్యక్షా !
ఆ విధంగా ముందుకు పోతంటె...
వాళ్ళ క్యాంపస్‌లు మొదుగ పూతపట్టి భగ్గుమంటన్నయి
కోర్టులు పాంప్మీదకు ఒడుపుగ ముంగిసలైతన్నయి
కవులు కళాకారులు కాగడాలు
ఉళ్ళన్నీ బతుకమ్మలు... బోనాలు
అంతా సె॥17 దగ్గర పానసరం బంటున్నరు
మానవహక్కులకు తమ ప్రాణం అడ్డేస్తున్నరు.
ఒక్క గొంతుకతో'సెరీ' అంటన్నరు
వాళ్ళ భాష... ఆ చేష్టలు
వాళ్ళు మావోయిస్టులు
ఇదిగో శ్రీ క్రిష్ణా
శ్రీ క్రిష్ణా ఇక్కడి రాజకీయం నీకు దెల్వది
నువ్ కామ్‌గుండు
పరిష్కారం నేను చెబుతాను
ఆ విధివంచితను మళ్ళీ పెళ్ళికొప్పించు
వేదిక అదే హైదరాబాద్
మిగతా కథ నేను జూసుకుంట
(మన విజయవాడకస్తే... చెప్పినకదా 'అదే' అన్ని మాట్లాడుకుందాం)
జై సోనియా ! జై సమైక్యాంధ్ర !

---

1971, గంగిపెల్లి, మానకొండూరు మండలం.



# దేవులాట

- కాలిపాక శోభరాణి
9491367409

పూసిన.. తంగెడి.. పువ్వు.. పువ్వోలె
ఉన్న.. ఆ తల్లిరూపం..
తొలుకుడు.. తొట్టెలోలె.. ఉండేటి
బావులు.. కుంటలు..
అలుగులు బారిన .. వాగులు.. వంకలు
పెద్దలకు.. బియ్యమిచ్చే.. పెత్తరమాసకెలి
ఝరువయ్యే.. వాతావరణం.. తీరొక్క
పూలతో.. కొలువులు.. దీరే.. బతుకమ్మ.. సౌరభాలు

ఆయేటి.. పూనిందంటె.. నిలబెట్టి.. కురిసే.. వానల్లు
కరిగి.. పులకలెత్తె.. భూమి.. సువాసన

ఇప్పుడంతా.. తల్చుకుంటుంటే
ప్రాణమంత.. ఆవిశిపోతుంది.
సంకురాత్తిరికి.. అవుపెండనుండు.. గరికపోచలూ
మార్కెట్లో.. కొనుక్కునే స్థితికెదిగినం
ఆధునీకరణ.. ప్రపంచీకరణ.. దాగుడుమూతలాడంగ

పొత్తు కలుపుకుందామని.. పోతంగ.. వచ్చి
ముచ్చట్లు బెట్టింద్రు... మురుబతు.. చేసింద్రు
ఏకోలె.. వచ్చి.. మేకోలె.. దిగబడ్డరు...
మొగులు.. ముట్టే... మాటలతోటి.. కుత్తెపు.. పెద్దమనసులు
నిండా ముంచింద్రు...

స్వాతంత్ర్యమచ్చి... అరువై.. ఎండ్లు అయినా
కడుపుకింత.. తిండి.. తాగుటానికి.. నీళ్ళు.. కరువై
నీడకు.. ఏటమటుమైతున్న.. తెలంగాణ ప్రజలు

సగం.. మూడు పాళ్ళు.. పారుకం.. ఉన్న.. జీవనదుల్ని
నిధుల్ని, కొలువుల్ని.. మల్పుకుంట.. దోపకంటేస్తుంద్రు

ఎంతో.. మంది.. తెలంగాణా బిడ్డలు ప్రాణత్యాగం

చేస్తున్నా.. కంటనీటిసుక్కరాని.. నెనరు లేని నాయకులు
అయినా ఎద్దుపుండు.. కాకికి ముద్దొయితదా?

ఇంటోడు.. పొయ్యి... దొంగల్ల.. కల్సినట్టు
గింత.. శమ.. ధర్మం.. లేని .. మనోడు
నల్ల.. సరబ్బండై.. పదవుల కుర్సీని
కర్సి పట్టుకొని.. పదిలంగున్నడు

ఎన్కట.. తెలంగాణాల.. ఇరువై అయిదువేల
చెరువులుండంగా.. వాట్ని... అయిదువేలకు
కుదించిండ్రు.. ఊరురా.. చెరువులను.. బొందలుగా
చేసి కూడ్చి.. భవంతులు కట్టంగా.. కువారిల్లుతున్న తల్లి
ఎవుసం భూముల్ని ఆక్రమించుకొని.. అమ్మకానికి.. బెట్టి
మన.. కంట్లె.. మన .. వెళ్ళతోనే.. పొడుస్తున్నరు.
సింగరేణి.. సిరులను.. కరెంటుకొరకు.. మూడు.. నాల్గు.. పంటలకు
తరలించుడెనాయే.. సంచులు నింపుకొనుడెనాయే

ఇప్పుడు.. తెలంగాణా.. పల్లె .. పల్లె
నెర్రెలిచ్చి.. దూపతోని.. ఉన్న...
తర..తరాల.. దోపిడిని.. ఎలుగెత్తుతున్నది.
ఏ పండు.. ముదుసలిని కదిలించినా.. ముడుతకొక్క
వెతను.. వడిపిన.. ఒక్కో.. చెమట.. చుక్క
ఒక్కో.. కతను.. చెప్పుతుంది.
కలి.. కలి.. చేస్తున్న.. వలసలు...

సాలు... సాలైన... మీ... పొత్తుల... జిత్తులు
ఇగ.. భూమిని.. తన్నుకొచ్చిన.. జల.. మాదిరి
మా.. ప్రాంత.. పిల్లాపాపలు.. ఉద్యమించుతుండ్రు
మిగిలింది.. ఇగ.. తాడో.. పేడో తేలాల్సె ఉంది.

ఇప్పుడు.. మా వాకిట్ల... ఎర్రెర్రగా విచ్చుకొంటున్న
పైడి.. తంగెడు పూల.. స్ఫూర్తిగా
తెలంగాణా.. వచ్చేదాక...
లగాయించుడె.. తెగాయించుడె.

---

1960, హన్మకొండ.



## తెలంగాణా రాష్ట్రం ఖాయం

- డా॥ మలయశ్రీ
9866546220

నా తెలంగాణా

రాతియుగ జనావాసాల నుంచి

రాచరిక కాలాల ధాటి-దాటి, నేటి

ప్రజాస్వామ్య పాలన దాకా

ప్రజ్వలించి రాణించిన జాణ,

గత ఘన చరిత్ర ఖజానా

నా తెలంగాణ !

తెలుంగు గణం-తెలుగాణం

తెలంగాణం నా జన్మస్థానం

ఆశ్మక మహాజనపద రాజధాని పోతలి,

శాతవాహన పూర్వాంధ్ర తెలుగు రాజన్యుల

శాతవాహన తొలి రాజుల - రారాజుల

రాజధాని మన కోటిలింగాల

గోదావరి కృష్ణానదుల నడిమి దేశం ఇది

బౌద్ధ సాహిత్యం పేర్కొన్న 'అంధకరట్టి'

రామాయణ మహాకావ్య దండకాటివి

అనార్య (జాతుల) నాగభూమి ఇది

అశోక మౌర్య చక్రవర్తికి పూర్వమే

ఇటు బౌద్ధం వ్యాపించి, చక్కని స్తూపాలు వెలసినై

ఇది, ఇక్ష్వాకు, విష్ణుకుండిన,

రాష్ట్రకూటి, కళ్యాణి చాళుక్య,

కాకతీయ చక్రవర్తుల పాలనా కేంద్రం–
కన్నడ పంపభారతం పుట్టిందిక్కడ–వేములవాడ,
కందపద్యం పుట్టిందిక్కడ– కురిక్యాల,
కవిత్రయ భారతం అటువస్తే
తొలి రామాయణ భాగవతాలిక్కడివి.
తొలి స్వతంత్ర్య తెలుగు కావ్యం – శతకం
తెలంగాణా పాలకురికి సోమనాథునివి,
తొలి తెలుగు సమ్రాట్టులు – సమస్తాంధ్రదేశ్
పాలకులు మన కాకతీయులు – ఒరుగల్లు,
గోలకొండ కుతుబ్‌షాహీలు
హైదరాబాద్ ఆసఫ్జాహీలు ఇక్కడి వాళ్లు,
అసఫ్జాహీ పాదుషాలు ఆంగ్లేయులకు
అప్పుకింద అమ్ముకున్నవే – సర్కారులు, దత్తమండలం,
అవే ఇప్పటి కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాలు,
ఈ రెండు వందలేండ్లుగా
ఈ ఆంధ్రులు మద్రాసు తమిళులతో కల్సి ఉండి
తమ భాషా సంస్కృతులను సగం మార్చుకున్నరు
తెల్లవాళ్లపాలనలో కుయుక్తులను నేర్చుకున్నరు

తెలంగాణ, నైజాం ముస్లిం పాలకుల వల్ల
పలు అగచాట్లు అనుభవించింది.
అనుభవాల గుణపాఠంలో రాటదేలి
అదరక బెదరక ఎదిరించి నిలిచింది–

అక్కడ 15 ఆగస్టు 1947 స్వాతంత్ర్య దినం
అప్పుడిక్కడ రజాకార్లతోని పోరాటం
ఆఖరికి 17 సెప్టెంబర్ 1948న విముక్తి,
1 అక్టోబర్ 1953 ఆంధ్ర రాష్ట్రావతరణ
1 నవంబర్ 1956 ఈ ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు–



అప్పుడు, మళ్ళా 1969న, ఇప్పుడూ తెలంగాణ
ఉప్పెనలు–వేర్పాటు ఉద్యమాలు పోరాటాలు,
అది ఎందుకంటే – అంతటా వివక్ష !
ఆంధ్రావాళ్ళ అతి తెలివి
తెలంగాణా జనాల మెతకతనం–

ఈ 54 ఏండ్ల మన సమైక్య రాష్ట్ర పాలనలో
పట్టుమని పదేండ్లు కూడా ఈడ
ఈ ప్రాంత ముఖ్యమంత్రులు ఏల లేదు–ఏల?
పరిపాలన–కోస్తా, సీమాంధ్రులది
పల్లకి మోత, 'ఒహోం, ఒహోం' మ్రోత
లాలి జోల పాటలు ఈ నాయకులవి
ఇక్కడి భాష పోయింది.
ఇక్కడి సంస్కృతి పోతున్నది.
అన్ని రంగాల్ల వలసలు అధికమై
రాజకీయ వ్యాపార సినిమా పత్రికా కళా
రంగాల్ల వాళ్ళ జోరు ఎక్కువైంది.

బూతు నవలలు వాళ్ళవి.
మంత్రతంత్రాల రచనలు వాళ్ళవి.
దోపిడి గుళ్ళ ప్రచారాలు అక్కడివి.
రాపిడి గురువులు అక్కడి వాళ్ళు.
ఇక్కడి పూల బతుకమ్మల పూజ అటుపోలేదు.
అక్కడి పెండ గొబ్బెమ్మల పాటలిటు వచ్చినై.
ఇక్కడి స్వచ్ఛమైన తెలుగు అటు వెగటు యాస !
అక్కడి తమిళ ముద్ర ఆంధ్రం ఇటు సగటు బాస?
పత్రికలు పబ్లిషర్లు రచయితలు–రచయిత్రులు
ప్రతాపం–ప్రచారం, విద్యావైద్య వ్యాపారాలు అన్నీ అక్కడివే
ఫ్యాక్టరీలు అధికారులు వాళ్ళు – పనికి వీళ్లు,

ప్రభుత్వ ఉద్యోగాల్లోనే కాదు
ప్రభుత్వ ధనం కోట్లు కొల్లగొట్టిన ఘనులు వాళ్ళు.
సినీ హీరోల రెండు పార్టీలు అక్కడి వాళ్ళవి.
కమ్యూనిస్టు పార్టీలు రెండూ అక్కడివి,
నీతి పేర వచ్చిన లోకసత్తాకు వచ్చిన
ఒకే ఒక్క సీటు ఇక్కడిది,
బి.జె.పిని ఓడించిన పుణ్యులు తిరుపతి భక్తులు!
అదీ సంగతి – ఈ ప్రాంతం దుర్గతి.
ఇన్నాళ్ళ వాళ్ళ దోపిడీ/రాపిడి సైపలేకనే
ఇప్పుడు మనవాళ్ళ వేర్పాటు పాట–బాట?
బాధితులది వేరు పడే మాట,
వాళ్ళ పొత్తు పాట ఎందుకట?
మేత పోతదని – నీతి ఉత్తది!
వాళ్ళది వాళ్ళదే
వీళ్ళది వాళ్ళ పొత్తా?
అయ్యా – మీ పొత్తు చాలు,
మాది మాకు చాలు
వేరు తెలంగాణే మాకు మేలు,
మీది బలుపు ఆరాటం
మాది బతుకు పోరాటం
ప్రభుత్వాలవి పనికిమాలిన కాలయాపనలు
పక్షపాత స్వలాభ ప్రలోభ లాలనలు,
ఉద్యమం అన్నప్పుడు ఆటుపోటులు తప్పవు
ఉద్రేకం ఈ ఉద్యమం ఇక్కడి ప్రజలదిజ
ఇది ఆంధ్రుల స్వయంకృతాపరాధం;
ఏది ఏమైనా 'తెలంగాణా రాష్ట్రం ఖాయం!'

---

1940, చంజర్ల, మానకొండూర్ మండలం.



## గుయ్యారం

డా॥ నలిమెల భాస్కర్
9491598988

ఒక్కటా, రెండా...?
మీరిక్కడకొచ్చి యాభై ఏండ్లు దాటినై.
ఈడ ఎప్పుడో పాతవడ్డరు
మంచిగ ఏర్లు పాతుకపోయిన్రు.
ఏకంగ
మా నెత్తుల మీదనే అడ్డ చిటాయించిన్రా.
బూములు జాగలు
నీళ్ళు నిధులు.
ఉద్యోగాలు అన్ని ఊడప్ప–మొత్తం మాయం
మంచి మాటలు పట్టుకొని మార్మానం బోతె
మల్లచ్చె వరకు ఇల్లు గాలినట్టు
పెద్ద మనుషుల ఒప్పందాన్ని నమ్మినందుకేనా
మీతోని మా బతుకులిట్ల కాలవడ్డయి?

ఇగ మొదలయ్యింది తెలంగాణ లొల్లి.
ఇది రాజాధిరాజుల్ని ధిక్కరించిన నేల.
పోతన్న పుట్టిన పోతుగడ్డ.
తానీషానే ఎదిరించిన
రామదాసును కన్నతల్లి
నిజాముకే మత్రవడ్డ
దాశరథి, కొమురం భీముల భూమి.
ఇది జీగి జీగి జగిత్యాల గడ్డ.
ఇది సిరిసిల్ల పోరుగడ్డ.
తెలంగాణ అంతా
చాకలి అయిలమ్మ దొడ్డి కొమురయ్యల వారసత్వం.
ఇది వన్కని జన్కని మొండిజాతి.
ఇవ్వి రేషగొండి పుట్టుకలు
మాది మత్రం పట్టు
ఇగ తెలంగాణ కోసం
మా బిడ్డలు పానాలు దీసుకోరు
పానాలు తియ్యరు
వాటం తెల్సినోళ్ళు
ఏడ కాటు వెడితె రెండు పచ్చెలయితదో తెల్సుకున్నరు.
తమ మోచేతులల్ల బలంతోటి
మొండి గొడ్డలితోనైనా సమైక్యం తెగ్గొడుతరు.
ఆంధ్రులకు ఆరంభ శూరత్వం ఎక్కువ.
తెలంగాణోళ్ళు కొనెల్ల చూస్తరు.
ఒక్క కొనూపిరుంటె చాలు
ఏది చేసినా కొసెల్ల చేస్తరు.

---

1956, నారాయణపూర్, ఎల్లారెడ్డిపేట మండలం.



## ఒకే ఒక్క ఆశ

- మచ్చ ప్రభాకర్
09323183896

వేల వేల పిరమిడ్స్, మమ్మీల్లో
ఒకే ఒక్క "మహోంజోదారా"!
వేల వేల తత్వవేత్త ప్రవక్తల్లో
ఒకే ఒక్క "గౌతమ బుద్ధుడు" !
వేల వేల అలెగ్జాండర్, నెపోలియన్లో
ఒకే ఒక్క " సామ్రాట్ అశోకుడు" !
వేల వేల ఆక్స్‌ఫోర్డ్, కేంబ్రిడ్జిలో
ఒకే ఒక్క "నలందా" !
వేల వేల వేయి పడగల్లో
ఒకే ఒక్క "నా గొడవ" !
వేల వేల స్వతంత్ర్య పోరాటాల్లో
ఒకే ఒక్క " తెలంగాణా" !
వేల వేల పోరుగడ్డల్లో
ఒకే ఒక్క "ఓరుగల్లు" !
వేల వేల జైత్రయాత్రల్లో
ఒకే ఒక్క "జగిత్యాల" !
వేల వేల విద్యార్థి ఆందోళనల్లో
ఒకే ఒక్క "ఉస్మానియా" !
వేల వేల ఎరుపుగడ్డల్లో
ఒకే ఒక్క "నల్లగొండ" !
వేల వేల నిరాశ, నిట్టూర్పుల్లో
ఒకే ఒక్క "ఆశా – ఓదార్పు" !

---

1954, పోతుగల్, ముస్తాబాద్ మండలం.

## ఉమ్మడి రాష్ట్రంకు ఉరిశిక్ష

- నరసింహుడు
9701007666

అది జీవో కాదు
తెలంగాణ జీవితం

నిజం
అవి అక్షరాలు కాదు
తెలంగాణ అమరుల రక్తపు చాల్లు

కండ్లల్లో వత్తులేసుకొని చూసినం
కండ్లు 'కాయలు' కాసినయి, 'పూతలు' పూసినయి
ఇండ్లల్లో ఇగనన్న 'దీపం' వెలుగుతదనుకున్నం
మసిని, నుసిని నింపింది

మేము ఎగిరినప్పుడల్లా
ఎండమావులను చూపి ఊరిచ్చుడు
మేము గుటికిల్లు మింగుడు
మొదటిది కాదు
చివరిది కాదు

అప్పుడు "ముప్పై ఆరు"
ఇప్పుడు "ఆరువందల పది"
ఒక్కటా, రెండా, మూడా...
ఏలిక వారి
వలస వారి
వలస వల పక్ష బలికి
ఇది ఎన్నో "దాళ్లా" నో



ఏం ఊరిత్తవుతియి
ఇరవై ఐదు సంవత్సరాల తర్వాత కూడ
తెలంగాణలో ఎవ్వనికి
నోట్లో ఊరిక్కు బుడుత లేవు
ఉప్పెన పుడుతొంది
కడుపంత మసులుతాంది
కుత్తికలు తెగ్గోసే కులకప్పి నీది
కట్టలు తెంపే కావురం నీది
కుట్రలు చేసన కుట్ర దారుడివి
నువ్విప్పుడు మళ్ళీ కోర్టులో ముద్దాయివి.

"మైలార్డ్ !
ఆరువందల పది ఒక్కటి చాలు అతన్ని శిక్షించడానికి
అదే కుట్ర, అదే నేరం, అదే ఒప్పుకోలు
ఈ కుట్రకే
వేల తెలంగాణ ప్రజలు నేలకొరిగారు
యువరానర్ ! తీర్పిచ్చే వరకు దయచేసి
కోర్టును వాయిదా వేయకండి"

"సారీ ! తీర్పును వాయిదా వేస్తున్నాను"

మరోసారి
కరీంనగర్ "ప్రజాకోర్టు"లో
విచారణ పూర్తయి శిక్ష ఖరారయింది!

ఉమ్మడి రాష్ట్రం
ఉరిశిక్షకు సిద్ధంగా ఉంది!!

క్షమాభిక్ష ప్రసాదించడం
ప్రథమ పౌరుడికి కూడ సాధ్యం కాదు !!!

---

1967, బొమ్మకల్, సైదాపూర్ మండలం.

# శ్రీకృష్ణ !
## (స్తోత్ర ముక్తకాలు)

- గజానన్ తామన్
9440211285

సోమకాసురుదుమమ
జొచ్చినవు నీళ్ళల్ల
నలువ కిస్తివి నాడు
నాల్గు వేదాలు

మా నీరు కాజేసి
మా నేల మరుభూమి
గా మార్చు నేర్పరుల
కరుణించకు హరి!

మా నల్ల బంగారు
మాకు దక్కే కొరకు
అవతారమెత్తు మా
యజ్ఞవరాహమ !



కొలువు లెన్నో దొరలు
కొల్ల గొట్టిరి, ఇంగ
వలువలే ఊడ్చెదరు
'పాహి', శ్రీకృష్ణ !

గుడిసె కప్పుల మీన
గుమడి పూవులు సొన
గోడ పూతలు సూడు !
గుఱ్ఱాల దౌడు.

కుంటల్ల, చెరువుల్ల,
కొండ వాగుల్లల్ల
తేలేటి బతుకమ్మ
తీరు బలె ముద్దు !

సమ్మక్క జాతరలు
సవ్వార్లు పీరీలు,
పోతరాజుల జోరు
బోనాలసొరు

గోండు రాజుల గొండ్లి,
గొల్ల బోయల సుద్ది
చిందు బాగోతాలు
చిరునామా మాది

మా ఉనికిలోగలవు
మధుమాస హాసాలు
వలదోయి వేరేమి !
తెలగాణ చాలు.

---

1936, చాకేపల్లి, బెల్లంపల్లి మండలం, ఆదిలాబాద్ జిల్లా.

# ఈరగోల

- వేముల సత్యనారాయణ
9849365990

అన్న!
మనం తెలంగాణోల్లమన్న!
పార్టి ఏదన్నగాని
మనం మనం ఒకటేనన్న
గిప్పటిమందం చూసి
నద్మంత్రపు పదవుల కోసం
ఆత్మవంచన చేసుకో కన్న!
తెలంగాణ గడ్డమీద పుట్టిన
ప్రతి బిడ్డ నరనరంల
తెలంగాణ కావల్ననుందన్న!
ఇది నూటికి నూరువాళ్ళ
నువ్వద్దైనన్న!
అబద్ధాల అభివృద్ధి లెక్కలు
అది దూప ఆరని ఎండమావులన్న!
చేతులు జోడిచ్చి దండం బెడుతున్న
కడుపు నిండిన నీకోసం కాదు
కరువు మండి కడుపు ఎండి
తండ్లాడుతున్న మనోల్ల కోసమన్న
లడాయిలొల్లికి నోరు కలుపన్న !



గల్మదాటి ఇమ్మతియ్యన్న!
రేపు... సబ్బండవర్ణాలు
ఒర్రీ.. ఒర్రీ.. ఒర్రి
ఓపిక పట్టీ పట్టీ పట్టి
జోడిచ్చిన చేతులె
జీడివాతలు పెడితె
అయ్య బాంచనన్నోల్లె
ఈపుల పాపయ్యను లేపితె
నాటకాలాడెటోల్ల
నడుంబొక్క లిరగ్గొడితె..
వద్దన్న!
గంతముదిరేదాక
చూడొద్దన్న!
ఇగ ఒక్కమాటన్న
మన తెలంగాణ
విదియనాడు కాకున్న
తదియ నాడు
వచ్చితీరుతదన్న
గప్పుడు..
అందరితో కలిసి
అలాయి బలాయి తీసుకుంటవో
ముకమెత్తుకోలేక
మూలగ్గూసుంటవో
గిప్పుడె..
జెర జెల్ది
విచారం చెయ్యన్న !

---

1955, ఎల్లారెడ్డిపేట.

# మోదుగు పూలవనం

- అల్లం నారాయణ
9849365990

పల్లె నుంచి ఈ ఆర్ట్స్ కాలేజీకి ఎదురెక్కిన చేపల్లా వచ్చిన అణచివేతకు గురైన మానవ మాత్రులున్నారు. మట్టి మనుషుల మట్టి పాదాల కదలికలున్నాయి. దోపిడీ, పీడన, అస్తిత్వ వేదనల అసలు వారసులు అణగారిన కులాలు, దళితులు, బీసీలు ఆర్ట్స్ కాలేజీ ఉద్యమ నాయకత్వ జెండా అందుకున్నాయి. అదీ ఒక భరోసాయే. నమ్మండి. ఈసారి తెలంగాణ మోసపోదు. ఆర్ట్స్ కాలేజీ ఉంది. పుస్తకాల్లో పొడిచిన పొద్దు లాంటి లేత యవ్వనం. పురిటి నేల విముక్తి కోసం నెత్తురై పుష్పించే త్యాగం. ఆర్ట్స్ కాలేజీలో సూర్యోదయం. అదిప్పుడు తెలంగాణ ఆత్మ. తెలంగాణ కలను సాకారం చేసే... భగ్న స్వప్నాలను పునరుజ్జీవింప చేసే ఒక నూతన 'రినైజాన్స్' కేంద్రకం. అదొక నాభి. అక్కడ నుంచి లేచొస్తున్నవి. ఫీనిక్స్‌లా కలలు... కలలుగా.. ఇప్పుడిక.. రికామీకి కాలం చెల్లింది. అదొక పూచిన మంకెన పువ్వు. ఎనభయవ దశకంలో ఆ మెట్ల మీదుగా పిట్టగోడ వరండాలో నిలబడి విప్లవాల్ని కలగనే వాళ్ళం. ఫ్రెషర్స్‌డే కోసం కట్టిన వందలాది బ్యానర్ల తోరణాల మాలలు ఊగులాడేవి.

అయితే అవి వెలిసి పొయ్యేవి. కానీ.. జాజు రంగులో మెరిసే అక్షరాలు రాడికల్ వాయిస్‌లు, బిగించిన పిడికిళ్లు, అమర వీరులకు జోహార్లు. ఒక కదనరంగంలో నిలబడి కత్తు కోలాట మాడుతున్న నవతరం. చిరుగడ్డాలు.. లాల్చీ పైజామాలు, బన్ను, వన్‌బైటు చాయ్‌లు, ఎగ్గాప్లెట్లు... మల్లయ్య క్యాంటీన్‌లో ఎర్రెర్రటి ముచ్చట్లు, మావో, మార్క్స్, ఎంగెల్స్‌ను..'రీ ఇన్వెంట్' చేస్తున్నట్టు.. కాలం మోదుగ పూలవనంలా ఉండేది. ఇదిగో అదే ఆర్ట్స్ కాలేజీ మెట్లకు పాతిక సంవత్సరాల అనంతరం మొక్కి మాట్లాడ్తున్నాను.. తెరలు తెరలుగా జ్ఞాపకాలు పొరలినట్టే, పొరలు పొరలుగా పోరాటాలు కెరలినట్టే.. సమాజం సంక్షుభితమైనప్పుడల్లా.. ఆర్ట్స్ కాలేజీ తన చుట్టూ ఆవరించిన మైదానాలను దాటుకొని రోడ్ల మీదకు ప్రవహిస్తూనే ఉంది.

ఇప్పుడచ్చంగా ఉస్మానియా యూనివర్సిటీ చుట్టూ ఇనుప కంచెలు మోహరించిన ప్రత్యేక బలగాలు. విరిచినా విరగని ఫైబర్ లాఠీలు, రొండికి తుపాకులు తగిలించుకున్న చిప్ప టోపీలు..స్టోన్ గార్డులు..రబ్బర్ బుల్లెట్లు...ఇప్పుడొక యుద్ధరంగం హాస్టళ్ళ చుట్టూ.. మోహరించిన పోలీసు బలగాలు. ఆర్ట్స్ కాలేజీ ముందర తిరుగాడుతున్న తెల్ల బట్టల.. మరుగు మనుషులు. శకటాలు.. బయ్‌న మోగే సైరన్లు.. చార్జ్.. ఎన్నిసార్లు కొడతావు.. ఏమని కొడతావు. కొట్టిన ప్రతి దెబ్బకీ జై తెలంగాణ. కట్టిన ప్రతి గాయపు కదుముకీ జై తెలంగాణ. ఇప్పుడా కాషాయాలు, ఎర్ర జెండాలు, నీలి వర్ణాల నూతన అస్తిత్వ నమూనాలు చెరిగిపోయిన ఎల్లలు.



తెలంగాణ కోసం మా ఆత్మ ఒక్కటే. ఇప్పుడొక్కటే నినాదం.
ఐక్య నినాదం. ఇప్పుడొక్కటే గొంతు. వేయి గొంతుకలు ఒక్క గొంతుగా మోగుతున్న జై తెలంగాణ నినాదం. మార్మోగుతున్నది. ఆర్ట్స్ కాలేజీ గోడల మీదుగా దాటి వస్తున్న ఆ నినాదం తెలంగాణ అంతటా ఆవరిస్తున్నది. ఆర్ట్స్ కాలేజీ ఇప్పుడు తెలంగాణను కలవరిస్తున్నది. ఒకణ్ని మోసుకుపోతే అయిదుగురం కూచుంటాం. ఆ అయిదుగురినీ మోసుకుపోతే పది మందిమి కూచుంటాం. జానేదేవ్. కేరీరా? అకడమిక్ పుస్తకాలా? ఉద్యోగాలా.. గ్రూప్ వన్‌లా.. టూలా.. చూద్దాం. తెలంగాణలో ఉంది భవిష్యత్. దాని కోసం మేం విస్పష్టంగా చెబుతున్నాం. కొన్ని త్యాగాలకూ సిద్ధపడ్డాం.

వచ్చేదాకా తెగువ చూపాలి. ఇప్పటి తెలంగాణ ఉద్యమానికి దారి చూపుతున్న దిక్సూచి ఆర్ట్స్ కాలేజీ. మాకొక తెలంగాణ మాత్రమే కావాలె. తన్నులు తిన్నప్పుడో, లాఠీ చార్జిల్లో గాయపడినప్పుడో, పదమూడు కటకటాల వెనక బిక్కుబిక్కు మన్నప్పుడో, ఒంటరిని చేసిన ఆస్పత్రి వేదనలలోనో, దీక్షల్లో తీరని ఆకలేసినప్పుడో ప్రాణాలు అల్లార్చుకుపోతున్నప్పుడో.. ఆర్ట్స్ కాలేజీ జై తెలంగాణ అంటున్నది. అదిప్పుడొక ఆకాంక్షల ఆవాహన కేంద్రం. గుది గుచ్చిన పోరాట ఆరాటాల కేంద్రం. దిష్టిబొమ్మలు తగులబడ్డాయి. రాత్బళ్ల ధూలా ఆడ్డాయి. దున్నపోతల సదర్ ఆడుతుంది. చిత్రకారులు బొమ్మలు గీస్తారు. గాయకులు పాడతారు. ధూమ్‌ధామ్ కవులు కవితలల్లుతారు. చరిత్ర ఆర్ట్స్ కాలేజీని గానం చేస్తున్నది. ఊపిరులన్నీ, నా శ్వాసలన్నీ నీ మీదే ఉన్నాయి. ఉద్యమ కేంద్రం చుట్టూ వ్యాపించిన ఒక కళ. నేర్చుకొండి. నేర్చుకొండి. బహుశా రేపటి పొద్దుపొడుపులుమీరే. రేపటి వేగుచుక్కలూ మీరే. మావుల్ల.. రేవుల్ల.. మట్టి పొత్తిళ్లల్ల తొవ్వా పువ్వుల తీరుండే అమరుల వారసులు మీరే. కనుపాప చూపుల్ల మీరే. కన్నీటి పాటల్ల మీరే తెలుసా. ఒక రాజకీయ జేఏసీలో ఎవరుంటారు.

కనిపించే ముఖాలు ఎవరివి? పాతవే.. పోటీ పడే అధికార ఆరాటమే. కానీ చరిత్రలో తొలిసారిగా ఆర్ట్స్ కాలేజీ ముందర ఉద్యమ నినాదమిస్తున్న జేఏసీలో అణగారిన జాతులున్నాయి. పల్లెల నుంచి ఈ ఆర్ట్స్ కాలేజీకి ఎదురెక్కిన చేపల్లా వచ్చిన అణచివేతకు గురైన మానవ మాత్రులున్నారు. మట్టి మనుషుల మట్టి పాదాల కదలికలున్నాయి. దోపిడీ, పీడన, అస్తిత్వ వేదనల అసలు వారసలు అణగారిన కులాలు దళితులు, బీసీలు ఆర్ట్స్ కాలేజీ ఉద్యమ నాయకత్వ జెండా అందుకున్నాయి. ఆదీ ఒక భరోసాయే నమ్మండి. ఈసారి తెలంగాణ మోసపోదు. ఆర్ట్స్ కాలేజీ ఉంది. దాని మెట్ల ముందర మోహరించిన, దట్టించిన ఫిరంగి గుండ్ల లాంటి అణగారిన పిల్లలున్నారు. జయహో.. ఆర్ట్స్ కాలేజీ.. జయహో.. విద్యార్థుల జాక్.

---

1958, గాజులపల్లి, మంథని.

## హెచ్చరిక

- తైదల అంజయ్య
9866862983

ఆమె నాకు జన్మనిచ్చింది
నేనామెకు రక్తాన్ని ధార వోసిన
ఆమెనాకు కంటిచూపు నిచ్చింది
పల్లె పొలిమేరల వెంట కాపునై నిలుచున్న
ఆమె నాకు బాహువులనిచ్చింది
బానిస సంకెళ్ళను తుంచివేసన
ఆమె నాకు ధృడమైన పదములనిచ్చింది
రైతాంగ సాయుధ దళమై నడిచిన
ఆమె నాకు కలాన్నిస్తే
నేను పాటనై మార్మోగిన



ఆమె నాకు కత్తినందిస్తే
నేను వీరయోధున్నై గెలిచిన
ఈ శరీరాన్ని శ్రీకాంత్‌చారినై అగ్నిగోళంగా మార్చినా
వేణుగోపాల్‌నై దగ్ధమై పోయినా
యాదయ్యనై మంటల జెండాలనెగరేసినా
ఊరూరు గుమ్మాలకు ఎన్ని ఉరితాళ్ళు వేలాడినా
ఎండిన పంటను తగులబెట్టి
ఒడ్డున నిలబడి దుఃఖిస్తున్నా
ఖిన్న వదనయై అవనత ముఖియై
శతాబ్దాల యుద్ధభూమినుంచి
నెత్తురోడుతూ ఆమె నడుస్తున్నదింకా
ఆమె పిలిచే పోరు పిలుపు పిక్కటిల్లుతున్నదింకా
శత్రువు మిగిలే వున్నాడు
చప్పగా, చేదుగా, విషంగా, ఆకుపచ్చగా, డబ్బుగా, సమైక్యంగా
అనేక ముఖాలతో మాయతెరల చాటున
వాడు హైనా నవ్వు నవ్వుతున్నాడు
ఇపుడామెను ఊహించడం కష్టం
ఆమెను ఊహించడమంటే
జూదంలో ఓడిన రాజ్యాన్ని తలచుకున్నట్టు
కన్నీరింకిన కనులు కోల్పోయిన కాంతిని వెదుక్కున్నట్టు
నిప్పురెక్కలు విదిల్చి నిలిచిన మోదుకు చెట్టుకింద
కొత్త చిగుర్లని కలగంటున్నం
విముక్తి దొరికే దాకా సరిహద్దు మీద కాచుకొంటం
కుట్రలై వస్తారో, కుయుక్తులై వస్తారో,
ఏ పాత్రలో వస్తారో, ఏ యాత్రలు చేస్తారో
రండి! రండి! మేం దండయాత్రకే సిద్ధం!

---

1975, నాగసముద్రాల, కోహెడ మండలం.

# ఈ మట్టిపై ప్రేమెందుకు

- సూరెపల్లి సుజాత
9849468281

ఎందుకు ఈ మట్టిపై ఇంత ప్రేమ
ప్రాణాలు ఎక్కు పెట్టి అన్యాయాన్ని ఎదిరించిన
రక్తం నరనరాన ఏరులై పారుతున్నందుకా
కుట్రలు కుతంత్రాలు మచ్చుకైనా తెలియని
పురాణ కథల వారసత్వం పుచ్చుకున్నందుకా
అమాయకత్వం, ఆక్రోశం ఊపిరులైనందుకా!
ప్రపంచీకరణ పూజలో ఒళ్లనూ మాటనూ ఏకాణాకైనా అమ్మి
నేను అనే ఊబిలో ప్రపంచం కూరుకు పోతుంటే
రాజకీయ డ్రామాలో కొత్త పావుగా మారుతుంటే
బీటలైన ఈ నేల ఎడారిగా మారుతున్నా
ఈ మట్టిపై ఎందుకూ ఇంత ప్రేమ?
చావు తప్పదని తెలిసి అడవుల పాలవుతావ్
ఈ మర మనుషుల చేతిలో ఆహుతి అయితావ్
చెట్టులో, పుట్టలో ఏ పాముందో తెలియకుండా
నిండా నూరేళ్ళు బతికి సాధించకుండా...
అర్థాంతరంగా నువ్వు నిష్క్రమిస్తే
ఈ నేలని ఎత్తి పట్టుకునేది ఇంకెవరూ.
నీ రక్తం ఈ మట్టిని మారుస్తుందనా?
నీ ఆత్మ ఘోష ఈ రాళ్ళను కరిగిస్తుందనా?



ఒక్కక్షణం ఆలోచించకుండా
కాల్చుకొన్న
నీ చితి మంటలలో రగిలే గుండెలకి
బాధలో నీ ఊరు మరింత ఉక్కిరి బిక్కిరి అయితుంటే
ఈ నేల తల్లికి ఏం సమాధానం చెపుతావ్.
అమ్ముడుపోకుండా
అలుపెరుగకుండా పోరాడే
నీ జీవితం ఎంతో విలువైనది
నీ ఆవేశపు జ్వాలలో ఎందరో కుహనా హీరోలు ఆహుతి కావాలి
నిప్పులాంటి నీ ప్రాణం సదా రగులుతూ రగిలిస్తూ ఉండాలే
శత్రువు గుండెలో శలభమై పక్కలో బల్లెమై తేలాలి
నీ ఊపిరి అవిరులై ప్రతి ఒక్కరిని ఆవహించాలి
ఈ మట్టి విప్లవ జ్వాలలతో పరిమళించాలి.
అలసి ఓడిపోయిన వారు కాదు మన బలం
ఎగసిపడే నీ ఆలోచనల వెల్లువే మన ప్రాణం
తెలంగాణ ఇంతవరకు తిరగబడి పోరాడింది
గుతపలందుకొని రాక్షసుల తరిమిందె
కారంపొడి అయి కళ్ళల్లో చిమ్మింది
ఉరికొయ్యలను ఎదురించి
చెరసాలలను ధిక్కరించి నిలిచిందే కాని
ఆశవీడి ఆత్మ త్యాగాలకు పాల్పడలే.
ఈ నేలల కత్తులు పుట్టుకు రావాలి కాని
ఇంకేమి దిక్కులేదని పారే కన్నీళ్ళు కాదు.
అలసి పోయి ఓడిపోయిన వారు కాదు మన బలం
ఎగసిపడే నీ ఆలోచనల వెల్లువే మన ప్రాణం.

---

1970, నల్గొండ.

## మూడు మాటలు - ఒక పాట

- డా॥ పత్తిపాక మోహన్
09811239219

ఊరిప్పుడు
మునుపటి ఊరు తీరుగ లేదు
పల్లె ఇప్పుడు ఎనకటి పల్లె గాదు.

నిన్నటిదాకా
నిదురబోయిన పట్నం
ఇప్పుడు కుబుసం ఇడుస్తాంది...

ఎగురుతున్న జెండా
ఇగురం జెప్పంటే
ఊరూవాడా ఏకమై
పల్లె పట్నం ఒక్కటై
ఉద్యమగీతం పాడుతున్నై.

బడి గుడి మడి ఏకమై
కదం తొక్కుతుంటె
సంకలోని పాప
సమరగీతం పాడుతుంది.

తెలంగాణమిప్పుడు
"తెగిన గాలిపటంగాదు"
తెలంగాణమిప్పుడు
"దారి దరి లేని ప్రయాణంగాదు"
తెలంగాణమంటె ఎత్తిన పిడికిలి
సరిజేసిన వడిసెల
మొగుతున్న డప్పు
దద్దరిల్లుతున్న నగారా.

తెలంగాణమంటే
సబ్బండ వర్ణాల శాన్ నిషాన్
గురి చూసి ఇసిరిన బాణం.

1972, సిరిసిల్ల.



## విస్ఫులింగ విభూతి

- ఎలనార
9885112609

నిన్న
గుండె గూటిలో
ఇంకా మొలవని రెక్కల రెపరెపలు
రాగ రూపం పొందని వికీర్ణ స్వరాలు
తన పంచమాన్ని తానే పసిగట్టని పికం
కొంచెం కొంచెంగా రాజుకుంటున్న కొలిమి
కత్తులు కాలేని ముడిలోహపు తునకలు
మూసుకున్న మూడవ కన్నులు
నివురు కింది నిప్పు కణికలు
కాగడాలు కాలేక పోతున్న కొరివి కర్రలు
ఇవన్నీ
నేడు
గుండె గుండెలో రెక్కలు విప్పిన రెపరెపలు
పికం గొంతులో ప్రతిధ్వనించిన పిరంగి మోతలు
చురకత్తులైన ముడి లోహపు తునకలు
పడగ విప్పుతున్న పల్లెల పలాశ పతాకలు
అనల నయనాలౌతున్న జనసామాన్యం
నిప్పు రవ్వలై నింగి కెగురుతున్న యువజనం
ఇవన్నీ
ఈనాడు రేకులు విచ్చుకుంటున్న అగ్ని పుష్పాలు.
రేపు
సంసక్తి సాధ్యపడని సంవిధానం సమాప్తమౌతుంది
మూడు ముక్కల ఆట ముగుస్తుంది
రగిలే రవ్వలు సమీచీన సమీరంలో చల్లబడుతాయి
ప్రజానలం పరిష్కార సద్భావనానీలంలో సేద దీర్చుకుంటుంది
కోటి రతనాల వీణ కొత్త గానం వినిపిస్తుంది
భస్మీకృత అత్మాహుత విస్ఫులింగాలు
దేశఫాలంపై త్రిపుండ్రాలద్దుతాయి

1940, ఎలగందుల, కరీంనగర్ మండలం.

## గాయాల కుంపటి

- డా॥ బి. దామోదరరావు
9440986279

నా తెలంగాణ
నేడు తీగ తెగిన వీణ
రగులుతున్న గుండె
గాయాల కుంపటి
దగాపడ్డ చెల్లి
దోప్కమైన పల్లె
నివురుగప్పిన నిప్పు
ఎగిసిపడెనా



వాదలన్నీ ఏకం
ఇక్కడ తుపాన్లు, ఉప్పెనలు
సముద్రంలోంచి రావు
మనుషుల గుండెల్లోంచి వస్తాయి.
బతుక్కు, మెతుక్కు పోరాటాలు
కడుపు నిండిన వాడికేం తెలుస్తాయి.
ఆత్మహత్యలు కావు ఇప్పుడు ఆలోచించాల్సింది
దుర్మార్గుల గుండెల్లో నిద్రించటం.
పక్కలో బల్లెం కావటం
పుర్రెల్లో బాంబులై పేలటం
నిద్రలో కూడ
తెలంగాణ నినాదం వినిపించటం.
ఆత్మగౌరవం అంటే
స్వతంత్ర జీవనం.
మోచేతి నీళ్ళకు
విదిలించిన మెతుకులకు
ఆశపడకపోవటమే.
కష్టాలు తప్పవు నిజమే,
కానీ, కాల్చి వాత పెట్టినా
కదలిక వద్దా !
కదలాలి తుది కదనానికి
ఆత్మ స్థైర్యంతో, అచంచల విశ్వాసంతో
అన్యాయం, అధర్మం,
చివరికి ఓడాలనీ చరిత్ర చెబుతుంది.
నా తెలంగాణ
నేడు తీగ తెగిన వీణ.

---

1950, గూడెం, ముస్తాబాద్ మండలం.

## బతుకు సొద

- మెట్టు రవీందర్
9908763566

చరిత్ర పొడవునా
బహురూపుల రాజకీయపుటెత్తుగడల్లో
తెలంగాణ పావవుతూనే వుంది.
అనేకానేక సందర్భాల్లో
తెలంగాణ ప్రజాస్వామికాకాంక్ష
నానావిధ అధికారకాంక్షలకు
పెట్టుబడవుతూనే వుంది.
ఓట్లు దొబ్బుకొని గద్దెనెక్కే పాలకులకు
పరమ సులువు సోపానమవుతూనే వుంది.
ఆత్మగౌరవంకై తెలంగాణ ఆరాటమంతా
దుష్టరాజకీయ క్రీడల్లో
ఆట బంతవుతూనే వుంది.
విముక్తికై సలిపే పోరులో
సమ్మక్క సారక్కలై
బందగీ, చాకలి ఐలమ్మలై
చైతన్య శిఖరమై ఎగసిన ప్రతిసారీ
తెలంగాణను చుట్టుముట్టి ఆక్రమించి నేల కూల్చారు.
స్వావలంబనకై సాగించిన తెలంగాణ
ప్రస్థానంలో అన్నీ దురాక్రమణ పర్వాలే.
అడుగడుగునా తన బతుకును గెలవకుండా పన్నిన కుట్రలే.
అంబరాన్నంటే నేటి ఉద్యమాల వెల్లువలోనైనా
అనాది బతుకు సొదకు చరమగీతం పాడాలి.
తెలంగాణ బతుకు గెలుపుకై ఆలంబన వెతుక్కోవాలి.
సంపూర్ణ విముక్తి దిశగా అడుగులేయాలి.

1961, ధర్మారం, మం॥ భీందేవరపల్లి.



## పొలికేకలు

- బూర్ల వెంకటేశ్వర్లు
9491598040

కండ్లముంగట కరిగిపోతున్న వయసు
ఏండ్లసంది కల్లెపెల్లై ఉడుకుతున్న మనసు
నినాదాన్ని బుజమ్మీద ఎక్కిచ్చుకొని
బొక్కబోర్లపడ్డ యాది
పాతగాయాలు, మరకల్ని లెక్కజెయ్యని
పోరాటాల పునాది

ఇది కాశ్మీర్ కాదు
టిబెట్ అంతకన్నా కాదు
అరవై ఏండ్లుగా నిలబడ్డ ఇజం
నాలుక్కోట్ల మనుషులంత నిజం.

ఈ నిజం నిరూపితమవడానికి
ఒంటికి మంటలంటించుకుంటున్న నిస్పృహ
తూటాల్తో మెదళ్లు ఛిద్రం చేసుకుంటున్న త్యాగశీలత
ఆకాశానికి చందమామల్లా వేలాడుతూ యువత
ఒక సామూహిక సత్యం కోసం
అలుపులేని కవాతు చేస్తూ ప్రజ.

ఇప్పుడు ఊర్లనిండా అంటుకున్న మంటలు
దార్లనిండా ఉద్యమిస్తున్న పిడికిళ్లు
జ్వలిత కాగడాలై నడుస్తున్న ముఖాలు
అవిశ్రాంతంగా అప్రతిహతంగా
గుండెలదిరేలా మార్మోగుతున్న పొలికేకలు
జై తెలంగాణ ! జై తెలంగాణ!!
నౌ ఆర్ నెవర్ తెలంగాణ !!

1973, లాలపల్లి, ఎలిగేడు మండలం.

## స్పిరిట్ తగ్గిందా...!

- పొన్నాల బాలయ్య
9908906248

గోగు పువ్వుల రథ చక్రాలతో నింగికెగిరే
ఆకాశ దీపంలో అమరులు వదిలిన
ఆశయాల స్పిరిట్ తగ్గిందా ఏంది...?
ఎందుకట్లా నేలకూలి పోతంది...?
అమ్లాలకు జల దాహమోలె
నేతలకు పదవీ మోహం ఎక్కువ
భూమి సూర్యుని చుట్టూ తిరగడం ఆగిపోతె
సూర్యుని మీద పడిపోతది అది ప్రకృతి
ప్రజల భావాలు తెలుసుకోని నేత మీద
ప్రజలే పడతరు ఇది వికృతి
గురుత్వాకర్షణ లేని అంతరిక్షంలో
ఏ వస్తువు బరువైనా శూన్యమే
జనబలం లేని లీడర్ ఎక్కడైనా జీరోనే
వాంది కంకిన బొక్కలకాశపడే
ఎంగిలి కంచాల కాడి కుక్కబతుకు
కన్నతల్లి వీరతిలకం దిద్ది పోరుకు పొమ్మంది
తల తెగినా తలవంపులు తేకన్నది
యుద్ధరంగం నుండి పారిపోయిన
ఆడిగుళ్ళ కొడుక్కి-
నులక మంచం సాటుకు పసుపు ముద్ద పెట్టింది
ఇగ తనివిదీర రక్తంతో తానమాడుకో!
రెండు భిన్న రూపాలున్నా మూలకం ఒక్కటే
కానీ వజ్రతేజమోలె వెలుగునిస్తావనుకుంటే
అగ్గినిచ్చే బొగ్గోలెనన్నా మండకపోతివి!
గ్రానైట్ లెక్క నున్నగ ఎక్కడికక్కడ
గట్లిరిగిపోతివి బిడ్డా...!



తరంగ చలనానికి శృంగం ద్రోణిలోలె
ఉద్యమానికి వందలు మిత్రలు వుంటయి
శత్రువు కదలికల ధ్వని వేగం
గాలి, నీటిలో కన్నా ఘన పదార్థాల్లో ఎక్కువ
పక్కోడు గెట్టు చెడగొడితెనే పౌరుషమత్తది
ఇక్కడ బతుకులే చెడిపోయినయి గద !
సూది మొనంత జాగియ్యనందుకే
కురుక్షేత్ర యుద్ధం జరిగింది
ధర్మం గెలిచింది... అధర్మం ఓడింది
అంగాంగ అమ్దాని వున్నోడు
మనల నెగులనియ్యడు...!
రెటీనాపై ప్రతిబింబం తలకిందులుగా పడినప్పుడు
వస్తువు నిలువుగా కనబడుడు ఎంత నిజమో
పగోనికి ఉద్యమం వంకరగా కనిపించుడు అంతే నిజం
ఆకలి అణిచివేత దోపిడి వున్నకాడ
తిరుగుబాటు రాకపోతె తిప్పలెట్లవపోతది
కంటికి కనిపించని లేజర్ కిరణాలు
శరీర అవయవాలను తెగ్గోసినట్టు
తేనె పూసిన కత్తులతో మెత్తగా కోస్తుండు
మంగులం పెంకలోలె ఈపుల మీద
ప్యాలాలేగుతాంటె...!
మంత్రి పదవులు, మజాలేంది...?
మా ఆశల వాహకానివైతవని అంటగడితే
నడుమంత్రాన కాని ఎత్తేత్తివి!
ఆనాడు నేతాజీ...
నాకు రక్తం ఇవ్వండి మీకు స్వేచ్ఛనిస్తానన్నాడు
నేడు రక్తం ఏరులై పారుతున్నా
నాకు ఓటెయ్యండి....
కోట్లు సంపాయించుకుంటానంటావా?
పదవులు బట్టుకొని వేలాడే
నువ్వేంది బిడ్డా నా కడుపుల చెడబుట్టినవు..!

---

1976, ఆరెపల్లి, కోహెడ మండలం.

## మీకెలా నమస్కరించను ?

- డా॥ కాంచనపల్లి
9676096614

చందమామ జేబులో పెట్టుకున్న వాడా!
చీకటి కొండ మీద దీపంలా వెలిగిన వాడా
ఉద్యమ సముద్రంలో అలుపు లేకుండా ఈదినవాడా!
వీరుడా.... నీకు జోహార్

ఇది స్వప్నమో... జీవితమో....
ఇది నిజంగా నిజమో లేక అబద్ధమో...
అర్ధరాత్రి ఇక సూర్యుడు పొడుస్తాడా
పగిలిందనుకున్న మృదంగం ఎంతబాగా నినదించింది
వీరుడా... ఒక చిరునవ్వు నవ్వు

బాగోతం తైతక్కలాడింది
దప్పు గొంతు విప్పింది
పోతన మళ్ళీ పుట్టాలనుకున్నాడు
అర్ధరాత్రి తుపాకీ దెబ్బ తిని
అరిచే ఖడ్గమృగం ఉలిక్కిపడింది
వీరుడా... నిన్ను ఎలా ప్రశంసించను?

ఆకాశం నిండ ఆత్మగౌరవ జెండా
రెపరెపలాడిన క్షణం ఇది
నాలుగు కోట్ల ఊపిరి తీగలమీద
మృతవీరులు పూవులై విరుస్తున్న క్షణం ఇది
స్వయంపాలన సుందరీ నీ
పోరాట అడుగుల్ని తమకంతో ముద్దాడిన క్షణం ఇది
వీరుడా... నీకెలా నమస్కరించను.

(09-12-2009 చిదంబరం తెలంగాణ ప్రకటన వెలువడిన తరువాత)

---

1960, జూలపల్లి మండలం.



## ఎవ్వడిక్కావాలీ విశాలాంధ్ర

- జగపతి వెలిచాల
9866660436

ఈ రాష్ట్రంలో
సమైక్యతకు కంకణం కట్టిందెవడట?
'మడి' కట్టుక చచ్చిందెవడట?

చదువులు కొలువులు
కొల్ల గొట్టిన్నాడు

"నీరూ" - "నిధులూ"
అక్రమంగా తరలించిన్నాడు

చావలేదా విశాలాంధ్ర - ఆనాడు
ఎవడి క్కావాలీ విశాలాంధ్ర ఈనాడు?

సమ భాగస్వామ్యం కావాలంటే
సమతుల్యం ఉండాలంటే

ఒడంబడికలను పాటించమంటే
హక్కుల కొరకు ఆందోళనలు చేస్తే

కాల్చి చంపలేదా ఆనాడు
మూడొందల యాభై మందిని

చావలేదా విశాలాంధ్ర – ఆనాడు
ఎవడి క్యావాలీ విశాలాంధ్ర ఈనాడు?

అక్రమాలను ఎత్తి చూపితే
అన్యాయాన్ని ఎదిరిస్తే

పోరాట యోధుల్ని
అర్ధరాత్రి చిమ్మ చీకట్లో
రాజమండ్రీ జైలుకు తరలిస్తే

చావలేదా విశాలాంధ్ర – ఆనాడు
ఎవడి క్యావాలీ విశాలాంధ్ర ఈనాడు?
పట్నం చుట్టూ అన్ని వైపులా
పూట గడువనోళ్ల భూములను
కొన వద్దని ఆంక్షలు పెడితే

'బేడాకు' 'పావలాకు' కొని
కబ్జా పెడితే
పాపం వాళ్లు నిర్వాసితులై – బికార్లైపోతే

చావలేదా విశాలాంధ్ర – ఆనాడు
ఎవడి క్యావాలీ విశాలాంధ్ర ఈనాడు?

ఎప్పుడో చచ్చిన విశాలాంధ్రకు
రోజూ రోజూ ప్రతిరోజు
ఏడ్చుడెందుకు

రా బ్రదర్ విడిపోదాం
స్నేహంగా.. సఖ్యతగా
హాపీ హాపీగా

---

1936, కరీంనగర్.



# దీపం వత్తి

- అన్నవరం దేవేందర్
9440763479

తెల్లారిందనుకున్న తెలంగాణకల
మల్లా తెర్లు తెర్లయింది
యాభై మూడేండ్ల చెర విముక్తి ప్రకటన
ఒక్క రోజన్నా నిలువలే

తినే ఇస్తారిల మన్నువోసింద్రు
కాళ్ళసందుల కట్టె వెట్టింద్రు
మంచినీళ్ళబాయిల మందు కలిపింద్రు

అడుగుపెట్టిన నేల మూలుగును
దోసుక తిన మరిగిన వాల్లు
ఢిల్లీ మాటలు, పార్టీ జెండాలు
పొతిపెట్టి కమ్మగ ఒక్కటైంద్రు

ప్రక్రియ మొదలైందన్న పలుకులను
గట్టిగా తాళం బిగించి
చిదంబరాన్ని సంకలేసికున్నరు
ఇగ శ్రీకృష్ణలీలల ఆట రక్తికడతది

పల్లె పట్నం సందూ సడుగు
బడి పిల్లల నుంచి పండుముసలి దాకా
ఆత్మ గౌరవ పతాకలైన ఆ కదలికలు
జనమంతా జైజై నినాదాలు

కల్వక కల్వక కల్సిన మన పతాకాలు
ఇచ్చుకపోయి రంగులు ఎల్సినయి

వాళ్లంతా ఒక్క పట్టున్నప్పుడు
మనోల్లు ఒక్కటిగ ఎందుకుండరు ?
పల్లె పల్లెనా ఆలోచనల వెల్లువ

తెర ఏదైతేందే ! ప్రోగ్రాం వాళ్లది
మాట్లాడుమన్న తీరు మాట్లాడుడు
ఎగురమన్న తీరు ఎగురుడు
ఒగడైతే నిత్తె పోలవరమనే కలవరింత

భూమి నీళ్ళు మొగులు నిప్పు
మాట ముచ్చట ఆట పాట పాఠం
అన్ని ఆకుల మీద ఆంధ్ర మరకలు
ఎంత కడిగిన వదలని గజ్జి

యాభై నాలుగేండ్ల సంసారంల
ఎన్ని కన్నీళ్ళు కాలువలు పారినయో!
ఎన్ని హృదయాలను కమ్రిచ్చుక తిన్నరో!

మంటర మంటర లేచిన ఉద్యమానికి
దోహద కారులు ప్రజలు
ద్రోహకారులెప్పుడూ రాజకీయులే
అరవై తొమ్మిది నుంచి ఇప్పటి దాకా
ఎన్ని కమ్మలు మర్లేసినా చరిత్ర గిదే

తెలంగాణ చేసికున్న పాపమేందో గని
అప్పుడు మూడువందల అరవై తొమ్మిది
ఇప్పుడు మల్లా అంతకన్నా ఎక్కువే
పచ్చని బతుకుల కోసం ప్రాణం ఇడుస్తున్నరు

దీపం పత్తిలా మనిషి మండుతుంటే కూడా
నిత్తె అబద్ధపు ఆత్మవంచనల లాలింపు.

---

1962, పోతారం (ఎస్), హుస్నాబాద్ మండలం.



## పల్లె తల్లి గుండె సప్పుడు

- హిమజ
94414 92737

పిల్లగాండ్లు మీరు కండ్లల్ల కనపడ్తున్నరు
ఒక్కసారి మనదేశం రాండ్రిరా కొడుకా
ఈడికస్తె ఆళ్ళకు ఆడున్న సౌలతులుండయి
సయిమాటే గని, పట్నంలనన్న వుండచ్చు మీరు
పదేండ్లకింద మీరచ్చినప్పటి లెక్క లేదు
మన పట్నమిప్పుడు

మన పల్లెకు రోడ్లు పడకపోతేంది
పట్నం రోడ్లమీద రోడ్లచ్చినయిప్పుడు
వూర్లె కరెంటు ఇస్తేంది ఇయ్యకుంటేంది
ఈడ రోడ్లనింద లైట్లే యాలాడుతున్నయి

మసూర్లె మనింట్ల బాయిలన్ని ఎండుక బోయినయి
పట్నంలనైతే పోంటెన్లు ఒక్క తీర్గ సిమ్మిచ్చిపోస్తయి

అయినా పూర్లల్ల వుండనీకి
పట్నం సుట్టు మన పల్లెలు యాడున్నయిప్పుడు

ఫిలిమిసిటీలట రింగు రోడ్డులట
హైటెక్కులట ఏంటేంటియో గిరివి బెట్టి
మీ దేశం దిక్కునుంచె
మస్తు పైసల్దెచ్చినట మిత్తికి
రాత్రాను గదేందో సింగపూర్లెక్క
జేస్తరట మన పట్నాన్ని

పైసవెడ్తె దునియ గనపడ్తుందిర కొడుకా
కడుపుల యత దించుకుందమంటె
సాయం బట్టెటోళ్ళు కనవడ్తలేరు
నా జీవునమున్నంతల
ఒక్కసారి అచ్చిపోండ్రిరా
ఈడనే మన మూలాలున్నయి
ముచ్చట్లున్నయి
బోనాలున్నయి
బతుకమ్మలున్నయి

ఇప్పుడు పల్లెతల్లి
అన్ని దిక్కుల కొట్టుకుంటున్న గుండెకాయ
తల్లి పేగు మిమ్ముల తర్లిరమ్మని
తండ్లాడుతున్న తలపోత !
పిల్లలు కోడలు నువ్వు
పయిలంగుండుండ్రి బిడ్డా !

1962, కరీంనగర్.



## "బతుకమ్మ"

- డా॥ కాలువ మల్లయ్య
9849377578

బతుకమ్మంటే...?
రకరకాల పూలతో పేర్చిన నిలువెత్తు గౌరమ్మ మాత్రమే కాదు
తెలంగాణ సంస్కృతికి నిలువెత్తు దర్పణం
తెలంగాణకే పరిమితమైన ప్రత్యేక పండుగ
ఐలమ్మ, దొడ్డి కొమురయ్యల ఆత్మార్పణం...
బతుకమ్మంటే...?

మా భాగ్యనగరం
గోల్‌కొండ ఖిల్లా, చార్‌మినార్, సాలార్‌జంగ్ మ్యూజియం,
అజాంజాహి మిల్లు, రామప్ప, వేయి స్తంభాల గుడి, ఖిల్లా ఒరంగల్లు జిల్లా...
కూకట్‌పల్లి నుండి పటన్‌చెరువు వరకు విస్తరించిన ప్రాంతం
పారిశ్రామిక రంగారెడ్డి జిల్లా
దేశంలోని అన్ని నిర్మాణాలకు శిల్పుల నొసగిన పాలమూరు జిల్లా...
నిజాం పాలనకు గోడ కట్టిన నల్గొండ జిల్లా..

బతుకమ్మంటే...?
కొమురంభీం జిల్లా అటవీసంపద, నిర్మల బొమ్మలు
భూ పోరాట వారసత్వాన్ని ముందుకు తీసుకెళ్ళిన కరీంనగర్
అనేకానేక భాషల నిలయం ఇందూరు
తెలంగాణ పారిశ్రామికవాడ 'మెతుకుసీమ'
నా తెలంగాణ కోటి రతనాల వీణ అన్న దాశరథిని గన్న ఖమ్మం మెట్టు

బతుకమ్మంటే...?
విప్లవగీతం, బహుజన కథ
దిగంబర కవిత్వం, అంబేద్కర్
భూ పోరాటాల వారసత్వ సంపద, శ్రామిక సంస్కృతి..
ఏముడాల రాజన్న, కొమురెల్లి మల్లన్న
కొత్త కొండీరన్న, యాదగిరి నర్సన్న
బాసర సరస్వతి, లష్కర్ బోనాల పండుగ
సింగరేణి గనులు, పోచంపాడ్, నిజాంసాగర్
శ్రామిక జనుల వర్గమాండలికం...

బతుకమ్మంటే...?
అందరికీ బతుకునిచ్చే అమ్మ
గోలకొండ, శాతవాహన, విష్ణుకుండన, కాకతీయులేలిన నేల
అస్తిత్వం కోసం అంగలారుస్తున్న తెలంగాణ పల్లె
వీరోచిత పోరాటాలు చేస్తున్న
ఏడు కోట్ల రతనాల సీమ, వీర తెలంగాణ...

బతుకమ్మంటే...?
మూసీ, మంజీర, మానేరు పరివాహక ప్రాంతం
కృష్ణా గోదావరి జీవనదులున్న నేల
పోతన్న, పాల్కురికి సోమన్న, వేములవాడ భీమకవి
పంప మహాకవి, గుణాఢ్యుడు అడుగుపెట్టిన స్థలం.
కాళోజీ, సినారెలను కన్న భూమి

బతుకమ్మంటే...?
పోరాటం.. పోరాటం.. పోరాటం
సామాజిక తెలంగాణ కోసం పోరాటం
రాజ్యం కోసం భౌగోళిక పోరాటం
రాజ్యాధికారం కోసం అవిశ్రాంత పోరాటం
తెలంగాణ సాధనే ధ్యేయంగా పోరాటం
జరిపే ఆత్మగౌరవ పోరాటం.

తేలుకుంట, జూలపల్లి మండలం.



# జిలేబి రేసు

- మద్దికుంట లక్ష్మణ్
9441677373

దారం ఎగురుతనే ఉంటది
తీరం దగ్గరనే కనవడుతది
వేలి కొసల పనితనం
మనసువడుతనే ఉంటది

అంతా అందినట్టే ఉంటది
అంతా అయిపోయినట్టే అనిపిస్తది
ఆట నడుస్తనే ఉంటది

గమ్యం కనిపిస్తనే ఉంటది
గుర్రు ఉరుకుతనే ఉంటది
మర్మం ఎరుకవుతనే ఉంటది

చెవులకాడ సప్పుడు చేసి
ఎదురుంగనే లైను కడుతరు
దొంగ తెలుస్తనే ఉంటడు

ఒకడు వాడని సూపిత్తడు
ఒకడు వీడని నిలువెడుతడు
ఇంకొకడు అయ్యనే అంటడు
కాదు అవ్వనే అని మరొకడంటడు
అంతా పెండల బుర్రిగాని ఆట

బైండ్లోల్ల జముకు సప్పుడుకు
ఎల్లవ్వ తల్లి ఎగిరినట్టు ఎగురుతనే ఉన్నం
మీ మంత్రాలు తంత్రాలు
అన్ని బైటవడ్డయి
ఎల్లవ్వ తల్లి కండ్లెర్రజేసింది
ఇగ సంచులు సదురుకోండ్రి బిడ్డా.

1964, రాచర్ల గొల్లపెల్లి, ఎల్లారెడ్డిపేట మండలం.

# పులకరింత

- అల్లం కృష్ణచైతన్య
001-7075018708

చినుకు తాకగ
చిరునగవై,
పుడమి పులకరింత..
చేరిన నేలన
నాల్గు దిక్కులై
కురవగ జల్లింత..
కవిత కదనమై
కారుమబ్బుల నీడలనొదిలి
కదలికేగి
కవనమయ్యింది..
కాని..
కాలం
కుబుసమై
కాళనాగుల ఒడిని వదిలి
కళంకమయి కాలం చేసింది..
నిన్న పాడిన పాటయేదొ,
ఆలంబనై
ఆరాటంగా రోదిస్తుంది..
చప్పున చిన్న చప్పుడేదో
అవిశ్రాంతంగ నసపెడుతుంది..
ఎక్కడో
ఎగసిన అల
అలవాటుగ
అలమటించి
అంతమొందింది..



వసంతం
ఒక్కొక్కటిగ
పూసిన పూలన్నింటిని
హతమారుస్తున్నది..
ఇనుప సంకెళ్ళ
నలిగిన
నలుగురు
రక్తమోడుతున్నరు..
తెగిన గాయాలు
గాథల గొట్లు
మానక ముందె
కొత్త కోతలు..
నల్లని సాయంకాలం
అసుర సంధ్యే
అదరగొడుతున్నది..
వడగాల్పులు..
విషమేదో
విధితలపై
విహరిస్తున్నట్టు..
తలవంచని
శిరసులన్ని
తెగిపడుతున్నవి..
కారుతున్న రుధిరమే
ఇందనమై..
కనులు నిప్పు కణికలై..
మాటలు పాటలు
మంటల పాలయి
మసిబారినవి..
ఓదార్పులు
ఓర్వని తలపులు

తగని చెలిములు..
ఉరికోతలు
ఉరుకే ఉద్యమం..
అణువణువు ప్రతి కణం..
తెలంగాణం..
అడుగడుగు ప్రతి గణం..
తెలంగాణం..
గుండెపాడు చివరి గానం..
తెలంగాణం..
రగులుతున్న నిప్పుకణం..
తెలంగాణం..
తిరుగుబాటు ధిక్కార నాదం..
తెలంగాణం..
బిగిసిన కోటి పిడికిళ్ళ ఉక్కు బలం..
తెలంగాణం..
రాలే వడగళ్ళ పోరాట స్వరూపం..
తెలంగాణం..
కన్నీటి కడగళ్ళ రౌద్ర రూపం..
తెలంగాణం..
అమరవీరుల ఆఖరి వందనం..
తెలంగాణం..
తెలంగాణ..
తెచ్చేదాకా..
వచ్చేదాకా..
చూసేదాకా..
తరం తరం నిరంతరం..
శ్రమిస్తాం అహోరాత్రం..
జై తెలంగాణ..
జై జై తెలంగాణ..

1984, గాజులపల్లి, మంథని.



## తెలంగాణ ఒక సత్యం

- సబ్బని లక్ష్మీనారాయణ
9247270941

సత్యం కోసం ప్రాణాలు అర్పించిన
సోక్రటీస్ మాట సాక్షిగా
సత్యం కోసం ఒక మాట
సత్యం ఎప్పటికీ సత్యమే
సత్యం వ్యక్తులను బట్టి మారదు
సత్యం ప్రాంతాన్ని బట్టి మారదు
సత్యం దేశాల్ని బట్టి మారదు
సత్యం సత్యమే సర్వదా
సత్యం నీరులా ప్రవహిస్తుంది
సత్యం గాలిలా వ్యాపిస్తుంది
సత్యం నిప్పులా అంటుకుంటుంది

సత్యం నేలనేలంతా పరుచుకొని ఉంటుంది
సత్యం నింగిలా విశాలత్వంగా వ్యాపించి ఉంటుంది
సత్యాన్ని కాదని అసత్యమని చెపితే
సత్యాన్ని చూస్తూ అసత్యమని ప్రచారం చేస్తే కూడా
సత్యం పారదర్శకంగా కాంతివంతంగా,
సూర్యకిరణాల ప్రభంజనంలా ప్రసరిస్తూనే ఉంటుంది
నేలను దాటి, ప్రాంతాల్ని దాటి,
రాష్ట్రాల్ని దాటి, దేశాల్ని దాటి,
తీరాల్ని దాటి, నింగీనేలను అలుముకుంటూ
సత్యం ప్రసరిస్తుంది సత్యతేజాన్ని ప్రస్ఫుటం చేస్తూ
అలా తల్లడిల్లుతున్న తెలంగాణ ఒక సత్యం
దగాపడ్డ తెలంగాణ ఒక సజీవ సత్యం
అరువై సంవత్సరాల సుధీర్ఘ పోరాటాల చరిత్ర సాక్షిగా
1969, మూడువందల డెబ్బయి మంది అమరవీరుల
తెలంగాణ స్థూపం సాక్షిగా
ప్రపంచ చరిత్రలోనే 4 వేల మంది
సాయుధ పోరాటయోధుల రక్తంతో తడిసిన
1948 - 52 తెలంగాణ సాయుధ పోరాటం సాక్షిగా
న్యాయంగా, ధర్మంగా, సత్యంగా
తెలంగాణ కోసం ఆరాటపడుతూ
నేడు ప్రాణాలు కోల్పోయిన
బిడ్డల సాక్షిగా
గాంధీజీ అహింసా సిద్ధాంతం సాక్షిగా
అంబేద్కర్ ఆశయం సాక్షిగా
తెలంగాణ ఒక సత్యం
తెలంగాణ ఏర్పాటు ఒక ధర్మం
తెలంగాణ ఏర్పాటు ఒక న్యాయం

---

1960, బొమ్మకల్, కరీంనగర్ మండలం.



## ఇడ్పుకాయిదం

-షహనాజ్ ఫాతిమా
9912268440

ఆమాల బుట్టిన సొంతన్న మీదల్గితే
"మీద మిటారం" జూపి మీద బడ్డ పోరుగోడు మందరంతా నాదేననే!
తెల్లదొరల్నుంచి నేర్సిన దొంగ తెల్విత్తో "లోపట లొటారం" జూపించే!
ఆ కాడ్నుంచి తెలంగాణలంతా అమాయకమే !
ఇద్దర్నిడ లొల్లి పెట్టిచ్చి గుద్దుకుంటుంటే తమాషా జూసుడే !
బుద్ది ఉన్నోల్లే ! కాటన్ దొర మనోడే, బ్రౌన్ దొర మనోడే అని
రాజ్యమేలినోళ్ళందర్ని "సూసుకొని ముర్వంగా"
ఒక్క కడ్పుల బుట్టి నోళ్ళం, ఒక్క "తీర్గ" బతుకుతున్నం కాదే !
మనం వేరని సెప్పుకొనిద్వాల్నెందుకే? మనం పరాయ్యోళ్ళం ఎందుకైతమే!
ఆడ్నే దెబ్బ దీసిన్రు, బుద్రకిచ్చి మాయసేసిన్రూ, మనల్నాసపెట్టి
సీమాంధ్రోల్లే అంతా దొబ్బుతుండ్రు, ఆస వుండ్లన్న పుట్టకపాయె !
ఉంటే తింటిమి, లేకుంటే పంటిమి. వాడు పేరు తెచ్చుకునే,

పైస తెచ్చుకునే, మన ముచ్చట్నే లేకపాయే!
"తోవేస్తే ఊరోనికి తెల్వివాస్తదనే" ఐకమతి 'ఉన్నోల్లల్ల'
ఇంకా పోకపాయె ఇంకా 'బాంచెను' బతుకేనాయే.
మన 'పెద్ద మనుసుల' బుద్దేడ గొడ్డుగోదల్తో గడ్డీగాదం మేయబోయిందో!
అమాయకంగున్న తెలంగాణ పోర్ని తీసుకపోయి
ఉషారుగున్నోల్ల కిల్లిచ్చి పొల్ల నిస్తిరి.
ఎట్లా ఏగిందో పోరి కండ్లల్ల పానం బెట్టుకొని
ఇగ నన్న ఇడ్పు కాయిదం ఇప్పియాల్నే !
చెర్వెండి పాయె, బాయెండి పాయె, వాగులెండి పాయె,
బతుకెండి పాయే, బతుకులు బర్బాదాయే!
భీవండి పోతిమి, సూరత్ బోతిమి, బాహర్ పోతిమి, బొంబై పోతిమి
రెక్కల్వొక్కల్జేసుకుంటిమి, వాల్లెల్ల గొడ్డే మల్లా ఉర్కస్తిమి
నా గోస దెల్సి, ఆసపెట్టి తక్వల నాయిల్లు జాగ తీస్కునే,
నా చెల్క చేనుగానే, నా గొడ్డు గోద గానే.
కారం పండే తోట్లె కపాస్ పెట్టే, మక్క చేన్ల పొగాకు పెట్టె,
భూం జాగ ఎందుకు పనికి రాకపాయె, కడ్పుకు మక్క గట్కన్న
నాల్కకు గొడ్డు కారమన్న లేకపాయే
నాయిల్లు నాకిమ్మంటే ఒర్రొర్రి పంచాయిత్జేసే, సాకుల్జెప్తి సంకల్ గుద్దుకునే
"ఊకుంటే తెల్వదాన్నట్టు నేనుండ
ఏహే! ఓహడిచ్చుడేందీ!? నా తెలంగాణ జాగా నాదేనాయే!
నా కట్టమే గెలుస్తంది. నాదంతా నేనే తీసుకుంటా
గోస గోసగుంది బతుకు
నా జోలికొచ్చి సతాయిస్తే ఉప్పు పాతరేసి ఊరబెడ్త
నా యింట్ల నేనే ఇగురం జేసుకుంటా!
ఇంకా ఏరే ముచ్చట్లద్దు
నా తెలంగాణ నాదే!

---

1964, సిరిసిల్ల, కరీంనగర్.



## ఆగమాగం

- జె. బాలవర్ధిరాజు
9492571852

అరవై ఏండ్ల సంది ఐకమత్యం లేక
ఆగమాగం గావడితిమి
ఎంతో సంపదను, ఉద్యోగాలనే కాదు
ఎన్నెన్నో పానాలను కూడా పోగొట్టుకోవడితిమి
బట్టకు, పొట్టకు లేక గోసగోస కావడితిమి
ఎవరో తెలంగాణ తె(ఇ)స్తరని
ఎంతగానో ఎదురు సూడవడితిమి
ఇక పార్టీలను నమ్ముకుంటే...
పని అయేటట్టులేదు
కుక్కలకెప్పుడు బొక్కలమీదనే ఆశవున్నట్టు
నాయకులకెల్లప్పుడు గద్దెలమీదనే ధ్యాసనేనాయె
ఇగ ఎట్లత్తది తెలంగాణ?

మొన్నటికి మొన్న జాతర్ల కలిసినట్టు
అందరూ కల్సి రాజకీయ జె.ఎ.సి.ని ఏర్పాటు జేసింధ్రు
పట్టుమని పది దినాలు గాకముందే
ఆ జె.ఎ.సికి దినాలు జేసింధ్రు
తెలంగాణ ఉద్యమం ఉత్త తాటాకు మంటని
సీమాంధ్రోల్లు సిత్రాతిసిత్రంగా నవ్వుకుంటుంధ్రు
ఓ నాయకుల్లారా ! పార్టీ కార్యకర్తల్లారా!!
ఇగనైనా...
ఆంధ్ర నాయకుల సంకలు నాకుడు మానుకోంధ్రి
సీమ నాయకుల మోచేతి కింది నీళ్ళుతాగుడు బందువెట్టుంధ్రి
మీలో ఇంకా చీము, నెత్తురూ ఉన్నాయనుకుంటే
పదవులను, పార్టీలను పక్కన పెట్టుంధ్రి
ప్రజల పక్కనే నిలబడి పోరాడుంధ్రి
ఒక చేత్తో - చప్పట్లు కొట్టలేం
అందుకే... విద్యార్థులు మరింత ఉరికురికి రావాలె
జెండాలన్నీ ఏకం జేయాలె
మనందరి అజెండా తెలంగాణె కావాలె
కలిసిరాని పార్టీలను పాతరవెట్టాలె
కవులు, కళాకారులందరూ కలువాలె
ఇగ ఏడుపు మాటలు, పాటలు బందువెట్టాలె
నిద్దుర పోతున్న జనాల్ని మేల్కొల్పాలె
పక్కా, పకడ్బందీగా ఉద్యమం చేపట్టాలె
ఇక ఇదే ఆఖరి యుద్ధం కావాలె!
తెలంగాణ వచ్చేదాక
తె(ఎ)గబడి పోరాడాలె !!

1966, మల్లారం, వేములవాడ మండలం.



# ఆశయ శుద్ధి

- మాడిశెట్టి గోపాల్
9440238852

సమున్నత ఆశయం ముందు
ప్రాణం విలువ ఎంత?
మండే గుండెల ముందు
శరీరానికి మంటలు ఓ లెక్కా?
తరతరాల కలల సాకారం కోసం
ప్రాణం తృణప్రాయమే.
లక్ష్య సాధనలో
మిగతావన్నీ ఇక చిన్నవే.
ఎద గాయాల ముందు
లాఠీ దెబ్బలు ఎంత?
రణ రంగంలో దిగాక
ఇక రబ్బరు బుల్లెట్లెంత?
విజయమో వీరస్వర్గమో
తేలాల్సిన సమయం
అరు నూరైనా తప్పదు
మన కలల సాకారం.
కాలే కడుపు సాక్షిగా
ఎండే గొంతు సాక్షిగా
ఎరుపెక్కిన కన్నీటి సాక్షిగా
రగులుతున్న గుండె సాక్షిగా
మరుగుతున్న రక్తం సాక్షిగా
వందల మంది వీరుల త్యాగం సాక్షిగా
మన నాదం, మన నినాదం
మన గమ్యం, మన ఆశయం... తెలంగాణ.

1964, వచ్చునూరు, తిమ్మాపూర్ మండలం.

# తెలంగాణ రోడ్లు

- శేషం సుప్రసన్నాచార్యులు
9490023792

ఇరువైపులా చెట్లతో
వచ్చిపోయే వాహనాల రోదలతో
ప్రమాదాల రక్త కన్నీటితో క్షణం తీరికలేని రహదారి
నేడు ఉద్యమాన్ని ఆభరణంగా చేసుకొని
శోభాయమానంగా విరాజిల్లుతుంది!
జై తెలంగాణా ! నినాదాల హోరుతో
కర్ణపేయాన్ని కలిగిస్తుంది
ఉద్యమ వంటావార్పు కోసం రసాలూరే వంటశాలగా మారింది !
సహపంక్తి భోజనాలకు విస్తర్లు పరిచింది!
ఇప్పుడు కర్ణకఠోరాల వాహనాల రణగొణ ధ్వనులు
మాయమయ్యాయి!
గంటెల సవ్వడి, గిన్నెల ధ్వని, పరిమళాల పలకరింపులతో
తెలంగాణా ప్రజల పులకరింపుకు చేయూతనిచ్చింది రోడ్ !
నినాదాల గర్జింపుల యుద్ధరంగమైన ప్రతి తెలంగాణా బిడ్డకు
వీరతిలకం దిద్దే ఆడబిడ్డగా అవతరించింది !
తెలంగాణా ఆడబిడ్డల బతుకమ్మ ఆటకు తన హృదయాన్ని
విశాలమైన చెరువుకట్టలా మార్చిందీ తొవ్వ
లయబద్ధంగా బతుకమ్మ పాట పాడుతుంటే ఆ రహదారి
లయాత్మకంగా జోలపాట పాడినట్టు నిశ్శబ్దంగా నిద్రపోయింది !
ఆదిలాబాద్ నుంచి అలంపూర్ వరకు
అతిపెద్ద మానవ హారానికి తానే పూలతోటగా మారి తెలంగాణా జడతో
ఉద్యమహారానికి పల్లె పడుచయింది !
క్రీడా ప్రాంగణమైంది, తరగతి గదిగా మారి తన
పిల్లలచే పరీక్షలు కూడా రాయించింది !
గర్జనలు, రణభేరులు, పొలికేకలతో ఒక దట్టమైన
అడవిగా మారి జనారణ్యాన్ని పోషించిన అడవితల్లిలా
అక్కున చేర్చుకుంది తెలంగాణా రహదారి !

1966, పొట్టపెల్లి, హుస్నాబాద్ మండలం.



# గిట్లనే వుంటం

-డా॥ కల్వకుంట రామకృష్ణ
9440152405

ఎన్నేండ్లని మా కన్నీళ్ళతోటి మీ నేలల్ని తడుపుకుంటరు.
అవమానాల్ని భరించిన గుండెలల్ల నెత్తుర్లు ఉడకయా మరి ?
మా లెక్క ప్రేమించుడు, పోరాడుడు మీకు తెలుస్తదా?
మేం లోపలా, బయటా ఒకటే తీరుగ వుంటం – నిప్పులెక్క!
కుట్రపుటాలోచనలూ – కువారాలూ – నక్కజిత్తులూ లేనిదే
పక్క మీద మీకు కునుకే రాదాయె!
'అంచేత' అంటే తప్పేమీ లేనపుడు
'ఆయింత' అంటే ఓర్చుకోవెందుకు?
మా మనుషులందరిదీ మట్టి వాసన !
మేం నిత్తె కొత్తగ మొలకలెత్తుతునే వుంటం.
మీరు నిత్తె మోకా చూసి కొలుస్తనే వుంటరు.
పక్కోన్ని నమ్మించి పడగొట్టుట్ల – పనులు జేసుకునుట్ల మీరు దిట్టలు.
మొసలి కన్నీళ్లకు – విషపు నవ్వులకు అలవాటైనోళ్లు మీరు.
పానానికి పానంగ దోస్తానీ జేసుడే మాకు తెలిసింది.
నెత్తుటి చుట్టరికాలు మావి ! విత్త సంబంధాలు మీవి.
మా ఒంటి నిండ తల్లి రక్తమే ప్రవహిస్తున్నది.
మేం గాయపడ్డ మనుషులం.
సోయి లేకుండ మేం బతుకలేం.
మేం గిట్లనే వుంటం !
మేం గిట్లనే వుంటం !!

1970, మెట్‌పల్లి.

## దొంగాటకం

- వఝల శివకుమార్
9441883210

కలయికలన్నీ కలయికలు కావు
రెండు భిన్నధృవాల మధ్య కలయికకు
సంకీర్ణరాగం సాధనం కాదు.
పొంతనలేని పోహళింపులో
పదమూ బతకదు పలుకూ బతకదు.
అసంబద్ధ పదాల కూర్పు
ఓ వైరి సమాసం.

సఖ్యతలేని చరణాలతో
'పాలకుల పల్లవి' కోసం కూర్చిన పాట
ప్రణవంగా ఎలా బతుకుతుంది?
పదాలు పదాలే
తోటలో పూలలా
గుండె గొంతుకలకు పూస్తాయి.
జన్మసాఫల్యం కోసమే ఊపిరి పోసుకుంటాయి.
అవకాశవాదాలే పదాల్ని స్థానభ్రంశం చేసి
వక్రభాష్యాలకు తెరలెత్తుతాయి
పలికేనోటిని బట్టి
పదాలు పూలౌతాయి ముళ్ళౌతాయి
తలపుల్లో విషాన్ని తలల్లో కెక్కించడానికి
పదాలు వాహకాలౌతాయి

అన్ని దీక్షలూ 'ఆమరణాలు' కానేరవు
రాత్రికిరాత్రి లగెత్తుకు పారిపోయే 'దీక్ష'



ఉద్యమం పేర ఉల్లెక్కాల ఆటౌతుంది.
బతుకు మరణంకంటే దుర్భరమౌతున్న చోట
ప్రాణాలు పాచికలౌతాయి
ద్రోహంనించి విడివడి
స్వతంత్రంగా బతకాలనుకునే ఆకాంక్షలకు
గర్భశోకాలు మిగులుస్తూ
పాలకపక్షం 'వ్యూహాత్మక' మౌనమౌతుంది'...
చరిత్రకు తెలుసు
నెత్తురంటిన పుటల వెనక
రాత్రికిరాత్రి తలెత్తిన
కుహనావాదం కుట్రౌతుందని
నినాదాలు అలవోకగా పుట్టవు
అవి కసలిన పేగుల్లోంచి పెల్లుబుకుతాయి.

ఒకసారి ఆశ్రయమైనందుకే
జనం పాట అనాథైంది.
జనం బాట ముళ్లదారైంది.
రెక్కకీ డొక్కకీ మధ్య నోట్ల పరదాకట్టి
దురద తీర్చుకుంటున్న ఒక వర్గం
శవాల మీంచి దాటిపోతూ
జీవచ్ఛవాలకు
సమైక్య స్వర్గాల
ఎండమావుల్ని బహూకరిస్తుంది.

నగ్నసత్యాల్ని అర్ధసత్యాలుగా
చూపిస్తున్న దొంగాటకం
ఆశయాల్ని అణచివేసే
భాషకోసం వెతుకుతుంది.

---

1956, వేములవాడ.

## కాలుతున్న బంతిపూలు

- ఆడెపు లక్ష్మణ్
9849157752

దిక్కుమల్లె తలరాత రాసుకచ్చుకున్నమె అవ్వా
పోరగాండ్లు పచ్చులోతే రాలపట్టిరి
ఎవల పానానికి వాళ్ళు పోవట్టిరి
తెలంగాణ వచ్చుడో సచ్చుడో ఏమోగానీ
సావులను కండ్ల సూడవడితిమి

పొలం పుట్రా ఎండవట్నేని
చేతుల పనుల్ని కడుపుల కాలేసి
గుంజుకున్నరని,
నీళ్ళు మల్లుతున్నాయని
కొన్నేండ్లుగా పోరాటం జేత్తున్నా
పంచాయితీల మీద పంచాయితీలు వెట్టి
మల్లేదో మూటిగట్టిరి

తెలంగాణకు అవుతలోల్లు
టీవీలల్ల ఏదేదో చెప్పి
సదువుకునే పోరగాండ్లను
రెచ్చగొట్టి రెచ్చగొట్టి
సావులకు దగ్గర జేసిరి.

పెద్దబడి దగ్గర మొన్న శ్రీకాంత్, నిన్న యాదన్న
కాలవెట్టుకొని సచ్చిరి.
కాసింత కనికరం లేని నాయకులు



దొంగేడ్పులేడిసి ఎవలపాట వాళ్ళే
పొందుతుండ్రు. మూటిలేని నాయకులు
ప్రభుత్వానికేం నచ్చజెప్పుతరు.
వీల్లు మనల్నే తొవ్వకు తీసుకురారే అవ్వా
మన బాటల ముండ్లకంపలు నాటుతరే అవ్వా
దోపుకం చెయ్యడం అలవాటున్నోని దిక్కే
మొగ్గు జూపుతరు
తెలంగానమంటే ఏందో తెలియజెప్పిన
ఓ సారూ...
ఇక గీకులం గాకులం అనేది లేకుంట
ఒక్కటైనం
మీరు గుత్పలందించడమే తరువాయి
ముసుగు కప్పుకున్న రాజకీయపోల్లను
తరిమికొట్టి మా తెలంగాణ మేం తెచ్చుకుంటం.
మేమేందో... మా బతుకేందో
మొన్న డాంబర్రోడ్డు మీద
వంటవార్పు చేసుకుని తిన్నప్పుడే తెలిసింది.

మా బతుకులల్ల మన్నువోసినోడెవ్వడో తెలిసినంక
ఇక ఎట్లూకుంటం
ఇయ్యాల పాలుతాగే పోరడూ
జై తెలంగాణ అంటుండు
పిరికిడి వట్టిన చేతులే
పిడికిలెత్తుతున్నాయి

సిగ్గులేని నాయకుల్లారా
ఇన్నేండ్లుగా గడ్డికరిచిన పాలకుల్లారా!
ఇకనైనా మారుండ్రి.

సిరిసిల్ల.

## ఇగ యుద్ధమే

- పెద్దింటి సాహితి

మరుగుతున్న మా ఒక రక్తపు చుక్క చాలు
తెలంగాణకున్న అన్ని అడ్డంకులను అంటించడానికి
తెలంగాణ వాసుల ఓపిక నశించక ముందే
అందరు ఉగ్రరూపం దాల్చి దండెత్తకముందే
అహింస గోడలు బద్దలు కొట్టకముందే
ఆయుధాలు చేపట్టక ముందే
ఇస్తేనే సరేసరి
లేకపోతే ఖచ్చితంగా ఉంటుంది గురి.

పరీక్షించకండి మా ఓపిక
పీకలేమనుకోకండి ఈక
మీరాడిస్తే తోక
చూపిస్తాం మా తడాక

భవిష్యత్తులోని కష్టాన్ని
ఊహించుకుంటేనే అంత రోషమా?
అయితే భూత వర్తమానాల నుండి
కష్టం అనుభవిస్తున్న మా కోప ఉధృతిని ఊహించండి.



ఇప్పుడు వచ్చి అన్నతమ్ముల బంధం అంటూ
మొసలి కన్నీరు కార్చకండి.
మీ నక్క జిత్తులు మావద్ద వేయకండి.
అదిరించి బెదిరించే వారే తప్ప
ఆదరించే వారుండరు తస్మాత్ జాగ్రత్త.

తెలంగాణం తెలంగాణం
అంటున్నది ప్రజాగణం
ఎగబడితే ఈ క్షణం
ఉండదు మీలో ఏ కణం.

ఆకలి చావులు, వీరుల ఆత్మార్పణలు అంటే
ఉండదు ఎటువంటి స్పందన
కాని బందులు నిరాహారదీక్షలు అంటే
ఖచ్చితంగా ఉంటుందా నిర్బంధన?

కలిసుంటే రాజధాని హైదరాబాద్
విడిపోతే కేంద్ర పాలిత ప్రాంతం
ఎందుకు మీకు ఈ స్వార్థం
ఇకనైనా అలవర్చుకొండి నిస్వార్థం.

ప్రాణం మీదికి వచ్చిందనగానే
రాత్రికిరాత్రి వచ్చిన తెలంగాణ తీర్మానం
భయం లేదని తెలియగానే
అయిందా తెలియని తీర్మానం.

ఉద్యోగాలు అన్ని లాక్కుని ఇచ్చారు
నిరుద్యోగ బిరుదు అప్పుడు
పదవి పోతుందని తెలిసి
ఇస్తామంటున్నారు అన్నదమ్ముల బిరుదు ఇప్పుడు.

---

1993, భీముని మల్లారెడ్డిపేట, గంభీరావుపేట మండలం.

## తెలంగాణ

- మనోహర్ దూడం
9440544479

ఆయింటి పెరట్ల మొలిసి
ఈ యింటి పందిరిక
పానమొలె అల్లుకున్న
పచ్చని సిక్కుడు సెట్టోలె
ఆత్మగల్ల మనిషి.

అలుకు పూత పూసి
కదుపగడిగి
ముగ్గేసి
కురాడు పుదిచ్చినంత
నిమ్మతిగల మనసు.

కాల్లు బురుదల్నె వున్నా
పెయ్యి నింద యిరగకాసి
గొలకలేసిన
వరిశేను ఊగినట్లు
కువ్వారం లేని మాట.

గాయిగాయి చేసి మనుమనికి
'కొత్తలు' చేతులవెట్టి
బుదురకిచ్చె
అమ్మమ్మ 'బొడ్లెసంచి' లెక్క



యాష్టపడని గావురం.

ఇసిరె తీసుకున్నా
ఇరుసు గుంజుకున్నా
ఇటేటు రమ్మనకున్న
ఇల్లంత దోచుకున్నా
ఉగ్గవట్టుకున్న పాణం.

బిత్తిరిదని
బీరిపోయిందని
ఎకసెక్కాలాడితె
బోకెత్తులేషాలేస్తె
కార్యాలవిశిపోయిన జీవునం.

కని
పబ్బతివట్టి
జబ్బల ఇరికిచ్చుకుని
కలిసుండే ముసుగుల
బొండిగె పిసికేతనానికి
ఇగ
అద్దెం మద్దెం అవ్వనితనం
అరికీజ్ లొంగనితనం.

తెలంగాణ
ఇవ్వాళ్ళ
నడింట్ల నిలవడ్డ
నిలువెత్తు ఆత్మగౌరవ మొగురం
తననుతాను
సానబెట్టుకుంటున్న ఇగురం.

---

1974, సిరిసిల్ల.

## లొల్లివెడుత

- తత్వాది ప్రమోదకుమార్
9441024607

ఇయ్యేల్ల మనమంత గయ్యనుడెందుకు?
మన ఇంట్లె అల్లంత మసలినందుక్క
ఇయ్యేల్ల మనమింత ఎందుకెంతొఖుడు?
మన నీల్లు అల్లంత మల్లి నందుక్క
ఇయ్యేల్ల మనకింత కయ్యాటలెందుకు?
పచ్చని బతుకును గిచ్చినందుక్క
ఇయ్యేల్ల మనకింత పెయ్యుడ్కుడెందుకు?
మంచితనంగనె ముంచి నందుక్క



ఇంట్లె నెగులనియ్క, ఏడ మెసల నియ్క
పచ్చగున్న మనల బతుక నియ్క
సొమ్ములన్ని దొచ్చి సోకులు వోతున్న
ఆంధ్రులంటె నాకు అగ్గివుట్టె.

ఎన్నెన్ని సెరువులు మనయి–ఎన్నెన్ని సెల్కలు మనయి
ఎన్నెన్ని కుంటలు మనయి–ఎన్నెన్ని పంటలు మనయి
ఎన్నెన్ని ఊటలు మనయి–ఎన్నెన్ని తోటలు మనయి
అన్నింటి జాడలేమాయె–అడ్డంటి మాయమైపాయె

వాగులిక్కడ వంకలిక్కడ–పంటలక్కడ పండుటెట్లరా?
జాగలిక్కడ భూములిక్కడ–సాగునీల్లటు పారుడెట్లరా?
మూగుడిక్కడ దొబ్బుడిక్కడ–మూటలక్కడ చేరుడెట్లరా?
భోగమక్కడ కర్నూలిక్కడ–పుట్టుకచ్చెడు మాయలేమిరా?
మా ఇంట్లెకచ్చుడు మా ఇంట్లెనె దిగుడు
మీ ఇంట్లె కతలనె మెచ్చుకొనుడు
మా ఇంట్లె మెక్కుడు మా ఇంట్లె పండుడు
మీ ఇంట్లె మనుషుల్నె మెచ్చుకొనుడ
మా ఇంట్లె మసులుడు మా ఇంట్లె సదురుడు
మీ ఇంట్లె తీరునె మెచ్చుకొనదు
మా ఎన్క తిరుగుడు మా పొంటె ఉండుడు
మీ ఇంట్లె మాటల్నె మెచ్చుకొనుడు.

నా తెలంగాణ పల్లె బంగారు ముల్లె
దొబ్బుకొని పోంగ జూస్తున్న దొంగలారా
మాయలన్ని తెలిసె మర్మమంత తెలిసె
మల్ల గిటు జూడకుండ నేన్లొల్లి వెడుత.

---

1968, తక్కళ్ళపల్లి, కథలాపూర్ మండలం.

# యాభయేళ్ళ యాతన

- ఎలనాగ
9866945424

కల తలక్రిందులయితే కలిగేది దుఃఖమే
తోటకాలిన దృశ్యంలోంచి
తొంగి చూసేది మోడువారిన హృదయచిత్రమే
ఒక మెరిసే స్వప్న వైదూర్యాన్ని పొదిగిన
సొంత కోటీరం కోసం
వడలిన పీడితాంతరంగాల మీద
వసంతాల పరచుకునే మధుర క్షణం కోసం
యాభయ్యేళ్ళ ఆరాటంతో
యాతన పడుతున్నానంటే
క్షోభ ముసిరిన ఈ అంతరింద్రియాల్లో
ఎంత వేడిమి నిండి వుందో ఎరుగలేవా నువ్వు?!



పాదం మోపిన భూమిని
పందేరం కోసం చాపలా లాగేసి
పొలాల పొడి నాల్కలమీద తుల్లింతలయ్యే
జలాల చైతన్యపుటలల్ని దారి మళ్లించి
నేలతల్లి బిడ్డల బ్రతుకు తెరువును
కాలరాస్తూ పెట్టిన ఎసరు
కంటకధామాలుగా మార్చింది ఇక్కడి ఇంటింటినీ
నోటికాడి ముద్దకు రెక్కలు మొలిచి
వెక్కిళ్ళను మేం మూటగట్టుకోవడం
నీ లెక్కలోకి రాదనుకుంటా

చీమల బారులు చేసిన చి(త్రా)ద్రాలకు
స్థానిక బ్రతుకుల లోపలి
సస్యశ్యామలత పరారు!
మానని గాయాల మీద మాటల కారాన్ని చల్లటం
రోజుకో నిప్పుల కుంపటి రాజేస్తూ
గోడమీది పిల్లిని సైతం సిగ్గిల్లజేయడం
ఇలా సాగినందుకే కదా
ఇలాకాలుగా విరిగిపోవాలనటం

పొసగని స్నేహ సంబంధానికి
ముసుగేసి ఉంచడం ఇంకెన్నేళ్లు?
దోసకాయను చుట్టిన ఇనుపకట్టు
కుదురుగా వుండ గలిగేది ఎన్నాళ్లు?

అందుకే
పచ్చని కల పరితాపపు చిచ్చులో దగ్ధమవ్వక ముందే
తోట పూర్తిగా మాడి పాటరాలిపోక ముందే
రెండు వసంత కావ్యాశ్వాసాలుగా
పరిచ్ఛేదమొందటమే పరమోత్తమం కదా!

---

1953, ఎలగందుల, కరీంనగర్ మండలం.

## గరుడుడి ఆన

- పి. వేణుగోపాల స్వామి
9985472211

శ్వేతాశ్వానికి నల్ల తోక!
మోసంతోనే మొదలయిన బంధనం
బంధుత్వం ఒక మేలిముసుగు
అది రెండు నాలుకల నైజం

బానిసత్వ విముక్తికి ఎన్ని మెలికలు
అమృతభాండమే కావాలట!
మా అణువణువు విస్ఫోటం చేస్తాం
అర అంగుళమైనా రాజీపడతామా

అమ్మా
వీరమాతా!

ఎంతకాలమీ బానిస బతుకు
ఎంతకాలమని ఈ విషనాగులను
వీపున మోయడం

సర్పయాగం సాగించయినా
సంకెళ్ళు తెంచుతాం
నువ్వు స్వేచ్ఛాగానం చేస్తుంటే
మేం ఆకాశంలో చక్కర్లు కొడతాం !

1962, రేకొండ, చిగురుమామిడి మండలం.



## రెండు యుద్ధాలు

- ఎం. నారాయణశర్మ
9177260385

అంతా ఒక జెండా కింద ఉన్నట్టే
ఎవరి ఎజెండాలు వారికే
ఇంటి దొంగను ఈశ్వరుడు కూడా పట్టలేడు.

అంతా ఒక్క మేనిఫెస్టోనే
అంగీకారాలు మాత్రమే వేరు
పార్టీ అంతా ఒక్కమాట మీదే
పథకాలు మాత్రమే వేరు
ఊరుకోమాట - ఏరుకో బొక్కెన

గోదాట్లో దిగాకె తెలిసింది

కుక్కకు తోక లేదని.
రాజకీయ ఆర్థిక సత్యాల మధ్య
ప్రజాస్వామ్యం ఓడుతూనే ఉంది
ప్రపంచంలో నమ్మి చెడినోడికి
తెలంగాణా ఓటరే ఉదాహరణ.

రాత్రికి రాత్రే చిదంబర రహస్యం
అందరికీ జ్ఞానోదయం చేస్తుంది.
ప్రజల ఆకాంక్ష రాజకీయ పట్టభద్రుల
చేతిలో రాజ్యమేలుతుంది

తెస్తానని ఒకరంటే
ఇస్తానని ఇంకొకరు
పార్టీలు రెండైతె
మాటలు రెండు నూర్లయిత్తై
ప్రజలకు మాత్రం
రాజకీయ వ్యాకరణం అర్థంగాదు.

పాటలువాడిన గొంతుక
లాఠీదెబ్బలు తిన్నవాపు
రెచ్చిపోయి చచ్చిపోయిన శరీరం
పస్తువండి నిరాహారదీక్ష చేసిన కడుపు
అంతా ఉత్తదే.
కిరీటం కాకెత్తుకపోయింది.
శవయాత్రకు తరలిరాకున్నా
ఆత్మవిశ్వాసయాత్రకు అంకురార్పణ.

ఇక రెండు యుద్ధాలు తప్పనిసరి
ఒకటి ఇంట గెలవటం
ఒకటి రచ్చ గెలవటం

1971, కరీంనగర్.



## ప్రజా తెలంగాణ

- పైడిపాల (నూటెంటి) శ్యామల
9490138596

నిజాం పిశాచి పీడ విరగడైందని
తెగ మురిసిన తెలంగాణకు
మూడొద్దుల ముచ్చటాయె సంబురం
కొరివి దయ్యమై కొంపల సొచ్చె సీమాఆంధ్రం

మన భాష మన జాతి మనమంతా ఒక్కటని
మద్రాసు నుంచి వచ్చి వాడు మన పంచన జేరిండు
నమ్మి నానబెడితె పుచ్చి బుర్రలైనట్టు
నమ్మిచ్చి ఒప్పిచ్చి నయవంచన జేసిండు

అన్నదమ్ములమని వాడంటె
ఆలుమగల బంధమని చెప్పి
మొగని పెత్తనం వానికిచ్చె ఆ కలిపిన పెద్దమనిషి

ఇగజూస్కో నా సామిరంగ
పేనుకు పెత్తనమిత్తె నెత్తంతా కొరికినట్టు
నిజంగానె మొగడై వాడు
సవారి జేయవట్టె మనమీద సూడు

అన్నదమ్ములమనుకున్నా
కుదరనప్పుడు ఏరువడుడె
ఆలుమగలమనుకున్నా
పడిరానప్పుడు విడిపోవడె

కుతంత్రాలతో కౌరవులూ
వారి ఉప్పు తిన్న కర్ణుడూ
ఇద్దరొక్కటైనా
యుద్ధంలో గెలువలేదా పాండవులు
రంగుల కండువాలు మార్చే
రంకు బొంకు రాజకీయుల
రంగుల స్వప్నం కాదు తెలంగాణ

మేధావుల మేధోమథనం
కవిగాయక బృందగానం
కుల మత భేదం లేక పోరాడిన
సర్వజన సమ్మతం

పసిపాప బోసినవ్వుల్లోని వెన్నెల మత్తు
ముసలితాత ఒంటి ముడతల్లోని గమ్మత్తు

తెలంగాణ తల్లి శోభ
తెలంగాణ భాష ప్రభ

అది తెలంగాణ
మన తెలంగాణ / నిజ తెలంగాణ
ముక్కంటి సాక్షిగా
ముక్కోటి ప్రజా తెలంగాణ !

---

1972, రంగయ్యపల్లి, భీందేవరపల్లి మండలం.



# ఇగ పుల్ల ఇరుసుడె

- పెద్దింటి అశోక్‌కుమార్
9441672428

నన్ను ఇష్టపడి నా వెంటపడి
ప్రేమా పెళ్ళి అన్నప్పుడు
ఆమెను నా కలల సుందరి అనుకున్న.
అమాయకంగా ఆశలను ఆమె చుట్టే అలుకున్న.
చాల్బాజీ పిల్ల నీ ఇంట్ల నెగులదిరా
మొఖం జూసి మోసపోకు
గుణం జూసి గుంజుకో
తియ్యటి మాటలకు తీర్థంబోతే అదిగుల్లె నువ్వు సల్లె అని
అవ్వానాయిన అన్నప్పుడు అపద్దమనుకున్న.
మొఖంలో బంతిపువ్వు
మేనిరంగులో తంగేడుపువ్వు
పెదవుల్లో గోగుపువ్వు
చిరునవ్వుతో నన్ను శాసిస్తే
మాటలతో కట్టిపడేస్తే
బతుకును బంగారం చేస్తుందని
సంసారపు సర్వగంపను
కొండగట్టు నుంచి కోటప్ప కొండదాక
ఇంద్రవెల్లి నుంచి ఇచ్ఛాపురం దాకా
చేతుల చెయ్యేసుకుని తిరిగినం.
జగిత్యాల జైత్రయాత్రకు తను జేజేలు కొడితే
నల్లమల దాకా నేను నడిచిపోయిన
పల్లెటూరి పిల్లగాడా అని నన్ను పలకరిస్తే
ఏం పిల్లో ఎల్దమస్తవా అని నేను పులకరించిన
మొఖం చూస్తే మొహనాంగి గుణం చూస్తే మోసకారి.
నమ్మి నానవోత్తే పుచ్చి బుర్రలు చేసింది.
సంసారాన్ని వ్యాపారం చేసింది.
అవ్వానాయినను ఆగంజేసి సుట్టాలను దూరం జేసింది.
మొదటినుంచి ఒక్కటే మంకు

నేను కడియాలంటే తను పట్టీలంటది
పుస్తెమట్టెలను సూత్రాలంటది
అంటీ అంటది సరే! నాది భాషనే గాదంటది.
దొడ్డుగంజి బుడ్డగోషి బతుకు బతుకే గాదంటది.
కోపమచ్చి అలిగిపంటే అదురకిచ్చి బుదురకిచ్చి
నువ్వునేను గాదా నా బతుకు నీది గాదా అంటది
బాయి నిండ నీళ్ళున్నా ఒక్కనాడు కుండి నింపది.
రెక్కలిరుగ కష్టం చేసినా ఒక్కనాడు కడుపు నిండది.
గడియ పురుసతు లేదు గవ్వ అందాని లేదు.
ఆడే చెయ్యి ఆడుతనే ఉంటది అరుకతి నహీ బరుకతి నహీ
ఎఱ్రమన్నుతో ఇల్లు అలికింది లేదు.
జూజూ పట్టీతో సున్నంబొట్లు పెట్టింది లేదు.
హఠాత్తుగా ఒకనాడు ఇల్లంతా చిత్రపటాలతో నింపింది.
చూస్తే అందరూ వాళ్ళ తాతలు ముత్తాతలే.
మచ్చుకు మా అవ్వానాయిన పోటువలు.
ఇదేమిటంటే నీకు చరిత్ర లేదంది.
అలిగిపంటే అదే బుదురకిచ్చుడు.
సంసారమన్నంక సదురుకపోవాలనుకున్న.
ఎన్నడన్నా తెలివికి రాదా అనుకున్న
నా బతుకును బాధను తెలుసుకుంటుందనుకున్న
పచ్చిపులుసుతో సలిబోనం తీసి
వులీదతో నోరు తీపి జేసి
నడింట్ల బొడ్డెమ్మను పేరుస్తదనుకున్న.
నన్ను ఆమోదిస్తున్నట్టే నావెంట నడుస్తున్నట్టే
సూత్త సూత్తుండంగనే తలుగు తప్పదీసింది.
నాయింటికే నన్ను పరాయిని చేసింది.
నా పిల్లలను పరాయివాళ్ళుగా చూసింది.
చూసి చూసి మనసు ఇరిగింది.
చల్... పడకపోతే పదిమంది పిల్లలున్నా
పక్కకు జరుగచ్చు.

---

1966, భీముని మల్లారెడ్డిపేట, గంభీరావుపేట మండలం.



# తెలంగాణ విద్యార్థి

- మంచాల వెంకటేశ్వర్లు
9533484422

ఆయన విద్యార్థి
తెలంగాణా విద్యార్థి
చైతన్యంతో చెలరేగిపోయే
చిచ్చరపిడుగై పెచ్చరిల్లే
నవీన తెలంగాణా అభిమన్యుడు
నలుబది ఏళ్ళుగా మాతృగర్భంలో
దగాకోరుల దాష్టికాలను
వింటూ, సహిస్తు

దృఢంగా ఎదిగిన
ఇనుప కండరాలు అవి
ఉక్కు నరాల ఉద్వేగం
ఓటమి ఎరుగని
వెనుదిరుగని దీక్షాబద్ధుడు
వాడు సామాన్యుడు కాడు
ఉక్కు కండరాలతో
మెరుపై మెరిసి
ఉవ్వెత్తున ఎగిసిపడే
విస్ఫోటక విస్ఫులింగం
అగ్ని కీలల అరుణ రథాన్నెక్కి
ఆహుతైనా అయితాడు
కాని
ఆత్మాభిమానాన్ని చంపుకోడు
వాడి పాదదయ భీకర తాండవం
భూకంపం సృష్టిస్తుంది
బిగించిన పిడికిలి
మహాప్రళయాన్ని సృష్టిస్తుంది.
అగ్ని కీలల్ని సృష్టిస్తాడు త్రినేత్రుడై
అణిచిన కొద్ది
తుఫానుల మొదళ్ళను చీల్చుకుంటూ
ఛిద్రం చేసుకుంటూ
బుల్లెట్‌లా పేలతాడు
వాడు తెలంగాణా విద్యార్థి

1962, మానకొండూర్.



# సైరన్

- వగుమూరి శేఖర్
9985411275

కమిటీలు నివేదికలు
నేతలాడే నాటకాలు
సమ్మినాన బోసేరో
పుచ్చులే బూటకం

తెగువ చూపినడిస్తేనే
తెలంగాణ బిడ్డ
విముక్తమై తీరుతుంది
ఈ పోరుగడ్డ

ఆంధ్రా మరణంలో
గోదావరి సిరులు
తెలంగాణ పల్లెలో
ప్రతినిత్యం ఉరులు

అప్పులు అవమానాలతో
బతుకు ఒక బరువు
పురుగు మందు నిలుపుతంది
బడుగు జీవి పరువు

ఊరువాడ కదిలింది
తెలంగాణ జై అంది
వలసవాది పాలనపై
పోరు చేయ సై అంది

అమరులైన బిడ్డలకు
అశ్రుతర్పణాలంది
పరపీడన విరగడానికై
జంగ్ సైరన్ ఊదింది.

1959, గాజులపల్లి, మంథని

## ఆట మొదలయ్యింది

- బుర్ర తిరుపతి
9963242525

ఇప్పుడిక ఆట మొదలయ్యింది
తెలంగాణా ఆట మొదలయ్యింది.
గల్లీకొక్క లీడరు గద్గద స్వరంతో
ఇక తెలంగాణా ఆట మొదలెట్టారు...
ఇక ఓటును ఆటలో పావును చేస్తారు.
గల్లీ–ఢిల్లీ అంటూ అంతా లొల్లే నంటారు.
పల్లె పల్లె నాదేనంటూ పావురాల జంటపై పల్లె పాటను సింగారిస్తారు.
మొండి గోడపై పిల్లిలా పిస పిస తిరుగుతూ మ్రోగించు నగారా! అంటారు.
మాటల మూటలు ముద్దుగా ముస్తాబు చేసుకొని
ఇక నీ ఓటు నా తెలంగాణా ఓటేనంటారు.
కోలాట దరువుల్లో, సమ్మక్క కొలుపులతో లంబాడీల సింగిడీలతో...
తెలంగాణా కోసం ఇక తెగించాల్సిందేనంటారు...
బోనాల పండుగను మానాల నెత్తురును
ఎడతెరపి లేకుండా మాట్లాడుతారు.
మూడు మార్లు ముచ్చటగా మోసగించిన తీరుకు
ముసి ముసి నవ్వే నవ్వుతాం కానీ,
ముద్దుగా నైనా తిరస్కరించని ధిక్కార స్వరం మాది.
ఇగురం తోటి పలుకే మీ ఇకమతుల మాటలను
ఇనామ్‌లాగా భావిస్తామే కాని ఈసడించుకోలేము.
నీ ఆటలకు మాటలకు పాటకు
పదసై అంటూనే సైరన్ మోగిస్తామ్ కానీ
సల్లగా జారుకునే స్వభావము మాకులేదు
ఇప్పుడిక నిజంగా ఆట మొదలయ్యింది...
తెలంగాణా ఆట మొదలయ్యింది.
తెగ తెంపుల సంగ్రామం మొదలయ్యింది.

---

1968, కూనారం, కాల్వశ్రీరాంపూర్ మండలం.



## ఆవుల కొట్లాటలో ల్యాగలు

- దొంత భద్రయ్య
9966677149

విశ్వవిద్యాలయాలు ఉద్యమ కర్మాగారాలైనాయి
విద్యార్థుల కమిట్‌మెంట్
పోరాటాన్ని పదునెక్కించి లక్ష్యాన్ని గురిపెట్టింది.
చినిగిన నెక్కర్లతో
చిల్లులు పడిన గుడిసెల్లో
అర్థాకలితో చదువుకున్న పోరగాండ్లు
గింత లడాయి జేస్తుండ్రని
తెలంగాణ తల్లులందరు ఉద్యమ తన్మయత్వాన్ని పొందారు.
విద్యార్థులంటే పార్టీలకు విసనకర్రలు కాదని
రాజకీయ జెండాలను మోసే బోయీలు కాదని
జెండాలకు ఎజెండా రూపకర్తలుగా
రాజకీయ నాయకులకు గమ్యనిర్దేశకులుగా

రంగులు మారిస్తే రచ్చకీడ్చే చిచ్చరపిడుగులయ్యారు.

విద్యార్థుల పోరాట స్ఫూర్తి
మేడారం సమ్మక్క సారక్కలా మనసు గెలిచింది
ఎములాడ రాజన్న
కొండగట్టు అంజన్న లాంటి కొలువులైనై
రామప్ప చెరువంతటి విశాలమైంది
తెలంగాణ ఉద్యమ పోరులో జతకట్టేందుకు
వాగులు వంకలు
చేనులు చెలకలు సంఘీభావం ప్రకటించినై.

ప్రకటనలు మారాక
ప్రయోజనాలు ఊరించాక
ఊసరవెల్లులైన నాయకుల తీరు మారింది.

నడువు నడువుమని నట్టేట ముంచినట్లు
ఉద్యమానికి దండుగా ఉంటామని
ప్రాణాలను తీసింద్రు
ఆవుల కొట్లాటలో
ల్యాగల ప్రాణాలు పోయినట్టు
విషం పూసిన తీయటి ప్రకటనల
విద్రోహం కుట్రతో
విద్యార్థుల ప్రాణాలు తీసింద్రు.

ప్రాణాలైనా అర్పిస్తామన్నోల్లు
మందకాడి కావలి కుక్కలెక్కనుండి
తోడేళ్ళు రాగానే తోక ముడిచినయ్.
అప్పుడు వందేమాతరం పాలకున్ని వణికించింది.
ఇప్పుడు జై తెలంగాణ వలసాంధ్ర పాలకునికి చెమటలు పట్టిస్తుంది.

1970, సిర్సపల్లి, హుజురాబాద్ మండలం.



# నువ్వులేక

- కె.వి.నరేందర్
9440402871

ఉద్యమమంటే ఊపిరి తీసుకోవటం కాదు
శాంతికోసం యుద్ధాన్ని ప్రజ్వరిల్లజేసే
సైనికుడెప్పుడూ బలిదానం చేయడు
ఉద్యమమంటే శవాల ఊరేగింపుకాదు
నిరసనంటే నిశ్శబ్దాన్ని మోసుకెళ్లటం కానేకాదు
మరణమే చివరిచరణమైతే
ఉద్యమగీతమెప్పుడూ అశృసంగీతమే.. అది మాకొద్దు
నువ్వెళ్ళిపోయాక.. మట్టి, చెట్టు, పక్షీ, పశువూ
తల్లిగర్భం, కన్నపేగు తల్లడిల్లిపోతున్నాయి
ఏభాషకీ లొంగని దుఃఖాన్ని నువ్వు మిగిల్చిపోతే
ప్రతిగుండె పుండై సలుపుతుంది
నువ్వు చిరిగిన స్వప్నమైనా.. చెరిగిన సత్యమైనా..
నువ్వులేని తెలంగాణ మాకెందుకు..
నువ్వు బతికుండాలి..
రేపు.. కంప్యూటర్ తెరలమీద కదంతొక్కే శాస్త్రవేత్తవు కావాలి.
పెద్దరికాన్ని ప్రేమించే చేతికర్రవు కావాలి
మట్టిరేణువు పొత్తిళ్ళలో పువ్వులై పరిమళించాలి
అంతేకాని.. ఉద్యమాన్ని స్వాగతిస్తూ
నువ్వు వీడ్కోలు తీసుకోవటం ఎంతవరకు న్యాయం..?
బలిదానమెప్పుడూ ఆయుధం కాదు..
ఇంకా ఎగరని పతాకాన్ని అమరుడవై.. అవనతం చేయకు
ఇది పోరుగడ్డ..
తప్పుచేస్తే రామున్ని నిలదీసిన రామదాసు వారసులం
నీ పోరు తెలంగాణా కోసమే అయితే
నువ్వు లేని తెలంగాణ ఎవరి కోసం..?
నువ్వు లేని ఉషోదయం కూడా
మాకు నిషిద్ధమే..!!

1962, చిల్కోడూరు, గొల్లపల్లి మండలం.

## పిడికిలి

- డా॥ విప్లవ్‌దత్ శుక్లా
9849185878

అసలు..
మనం మనుషులమేనా?
ఈ దేశ పౌరులమేనా?
మరి, కనీసం మాట్లాడే
అధికారం మనకెందుకు లేదు?
ప్రజాస్వామ్యం ప్రజలను
అణచివేస్తోందా?
నాలుగుసింహాలు
ఓ జింకను వేటాడే వైనం..



శరీరంపై విరిగే లాఠీలు
పౌరుషాన్ని పెంచే దృశ్యం-
కలాన్ని, కెమెరాను విరిచే విచిత్రం-
అధికారానికి అదుపాజ్ఞలు లేవు
ప్రభుత్వం తుపాకి సహాయంతో నడుస్తోంది...
అరుపులు, కేకలు, నినాదాలు
కన్నీళ్లు, నిరసనలు, తిరుగుబాటు
అన్నీ ఉక్కుపాదం క్రింద నలుగుతూ-
పాలకుల రాజకీయానికి
మన రక్షకభటులూ పావులే!
కనీసహక్కులు ఇవ్వని రాజ్యం
మానవత్వాన్ని మట్టుబెడుతోంది,
బతుకు అంధకారం చేస్తోంది!
యుద్ధం పోలీసుకు, ప్రజలకు కాదు,
మనిషి ఉనికికి, రేపటి మనుగడకు-
"మనసుల" ఒక్కటయిన
జనసంద్రం ఉప్పెనవుతోంది
ఒక్కరే సమూహంగా..
ఆవేశం ధిక్కారంగా...
తిరుగుబాటు బావుటాలు ఎగుస్తాయి
ప్రాణాలు తృణంగా
ఉద్యమం ఉధృతమవుతుంది-
చరిత్రలో ఎప్పుడూ ప్రజలే గెలుస్తారు!
అందుకే జాగ్రత్త...
ఉద్యమాలు ఎన్నటికీ ఆగవు!
ప్రజా పోరాటాల్ని ఎవరూ ఆపలేరు !!

---

1965, హుజూరాబాద్.

## జయహో తెలంగాణ

- తల్వాది కృష్ణశర్మ
9441622834.

శ్రీ తెలంగాణ రాష్ట్ర సంసిద్ధి కొరకు
పంచ ప్రాణములను తృణప్రాయముగను
ఆత్మ బలిదానమొసగిన అమరవీరు
లకు జోహరులు భక్తి పూర్వకముగాను

నాలుగు కోట్ల ప్రజాళిని కడుపార
గన్నట్టి శ్రీ తెలంగాణ తల్లి
పాడి పంటలొసంగి వాత్సల్యమున బ్రోచు
కామధేనువు తెలంగాణ తల్లి
కోరిన కోరికల్ కొఱత లేకనొసగు
కల్పవృక్షము తెలంగాణ తల్లి
ఆంధ్రాధిపత్యము నణచబూనిన భద్ర
కాళిక మన తెలంగాణ తల్లి

దీవెనలుగొని ఏకైక దీక్ష బూని
ఆంధ్రనాయక పాలనమంతరించ
శ్రీ. తెలంగాణ రాష్ట్ర సంసిద్ధి కొరకు
ఉద్యమించుడిక యువతీయువకులార!

కలిసి మెలిసి మనము కలనైన మనలేము
ఒక్క రాష్ట్రమింక నుండి యున్న
అన్నదమ్ములవలె హాయిగా విడిపోయి
రెండు రాష్ట్రములను నుండ మేలు

1945, తక్కళ్లపల్లి, కథలాపూర్ మండలం.



## వారసత్వం

- ఆవునూరి సమ్మయ్య
9849188633

అప్పుడు 'ఆంధ్రా గోబ్యాక్' అన్నది మేమే
ఇప్పుడు తెలంగాణ రాష్ట్ర కావాలంటున్నది మేమే,
అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడైనా సరె,
వలస పాలకులను తరిమి కొట్టాలనుకుంటున్నది మేమే

దశాబ్దాల తరబడి మా తెలంగాణ తల్లి,
ఆంధ్ర పాలకుల కబంధ హస్తాల్లో చిక్కి,
నిలువెల్లా గాయాలతో తల్లడిల్లుతున్నది
ఒంటి నిండా నిత్యం రక్తం కాల్వలై పారుతుంటే,
మౌనంగా మూగవేదనను అనుభవిస్తున్నది

ఇంకానా? ఇంకెన్నాళ్ళు?
చూస్తూ ఊరుకోబోమని హెచ్చరిస్తున్నాం
మీ అంతట మీరే
తెలంగాణ తల్లిని వదలి వెళ్ళిపోండి

దీర్ఘకాలిక సమస్యకు,
శాంతియుత పరిష్కారం కోసం దోహదపడండి

ఇంతకు మేం ఎవరమో తెలుసా?
స్పష్టంగా విను సమైక్యవాది !
మూడున్నర కోట్ల తెలంగాణ ప్రజలం మేం
తెలంగాణ తల్లి ముద్దు బిడ్డలం మేం

అంతేకాదు,
పాలకుర్తి ఐలమ్మ, దొడ్డి కొమురయ్యల
వారసత్వాన్ని పునికి పుచ్చుకున్నవాళ్ళం
తెలంగాణ తల్లి "శాశ్వత విముక్తి" కోసం
సాయుధంగా నైనా సరే
తిరుగుబాటు "బావుటా" ఎగురవేస్తాం!

1951, హుజూరాబాద్.

## మరణిస్తే ఏమి మిగలదు

-గాజోజు నాగభూషణం
9885462052

వాళ్ళు... ఆశల్ని భుజాలపై మోసుకొచ్చి
విశ్వవిద్యాలయాల్లో
కలల సౌధాల్ని నిర్మించుకుంటున్నవాళ్ళు!
సకలశాస్త్రాల్ని అవపోసన పట్టి
రేపటి ప్రపంచ నిర్మాణానికి సిద్ధపడుతున్న వాళ్ళు!

ముత్యాల్లా మెరిసిపోయే వెలుగు రేఖలు
ముట్టుకుంటే ముడుచుకొనే అత్తిపత్తిలు
ఘర్షణకు లోనైతే నిప్పులు చెరిగే చెకుముకి రాళ్ళు.
అలజడికి గురి అయ్యారో... అదవంటించే అగ్గిరవ్వలు.



వాళ్ళ ప్రపంచంలో వాళ్ళు హాయిగా జీవిస్తుంటే..
దశాబ్దాల కలను తట్టి లేపిందెవడురా
కందిరీగల తుట్టెను కదిపిందెవడురా

మలినమంటని మనసులాయె
మర్మమెరుగని మనుషులాయె
మీ మాయల మానిఫెస్టోల వాగ్దానాలకు
మాతృభూమి విముక్తమైన కలగన్నారు.

కలలు కరిగిపోగా, భ్రమలు తొలిగిపోగా
లాటీలను తూటాలను ముద్దాడిన సాహసం
తెలంగాణ తల్లి ఋణం తీర్చుకొనే ప్రయత్నం
మరణాన్ని చిరునవ్వుతో స్వాగతించిన సాహసం

యుద్ధాన్ని అనివార్యం చేసి
యుద్ధభూమిలోకి లాక్కొచ్చి
విద్యార్థుల నొంటరి చేసి పారిపోయిన విద్రోహుల్లారా!
త్యాగాలను, ద్రోహాలనూ చరిత్ర లిఖిస్తుంది.

వారిది.. పోరు మొదలయ్యాక వెనుదిరుగని సాహసం
వాళ్ళిప్పుడు సంధించిన ఒదిలిన బాణాలు
లక్ష్యాన్ని ఛేదించడం తథ్యం
తెలంగాణ సాధించడం సత్యం.
ఉద్యమ భారాన్ని తలకెత్తుకున్న బిడ్డలారా
బలిదానాలు మానండి... ఉద్యమాన్ని
బలోపేతం చేయండి
నాలుగుకోట్ల ప్రజల గుండెశ్వాస మీరు
మరణిస్తే మరేమీ మిగలదు.
జీవిస్తేనే... తెలంగాణ కల సజీవ సాక్ష్యమై నిలిచేది!

---

1964, జగిత్యాల.

## ఒంటె దూరిన గుడారం

తుమ్మూరి రామ్మోహన్‌రావు
(వాధూలస)
9849315055

ఆది నుంచీ
ఆశ్రితులకు ఆశ్రయ కల్పవల్లి
నా తెలంగాణా తల్లి
తెలివాహా నదీ తీరంలో
కోటిలింగాల సాక్షిగా
తొలి అడుగు మోపినప్పుడే
అడుగుపెట్టిన వాళ్ళనూ అడుగవచ్చిన వాళ్ళనూ
ఆదరించమనీ ఆశ్రయమిమ్మనీ
అఆలు నేర్పింది నా తల్లి
అందుకే...
ధూళికట్టలో బౌద్ధం స్థూపమయ్యింది
ఎన్నో చోట్ల జైనం విహారమయ్యింది
మహమ్మదీయులకు మలి ఖిల్లాలయ్యింది
పలువలస పక్షులకు నిలువ నీడయ్యింది
నా తెలంగాణా
ఇక్కడి నదుల్లో శిబి చక్రవర్తి తొడల నుండి స్రవించిన
త్యాగశీల రుధిర ధారలు ప్రవహిస్తాయి
ఇక్కడి గనుల్లో వనుల్లో
దాన కర్ణుడి దాతృహస్తాలు మొలుస్తాయి



కనుకనే..
నీళ్ళు మావి నోళ్ళు వాళ్లవి
పంటలు మావి పరమన్నాలు పరులవి
గనులు మావి పనులు ఎవరివో
ఓట్లు మావి నోట్లు ఇతరులవి
పెదవులు మావి పదవులు అన్యులవయ్యాయి
మా ఉదాసీనత తెలంగాణను
ఒంటె దూరిన గుడారం చేసింది
ఓపిక పట్టినంత సేపూ పట్టింది
ఇక ఊరుకుంటే లాభం లేదని గ్రహించింది నా తల్లి
ఇగ జూడు...
గొడవ చెయ్యమని గోదారికి చెప్పింది
మరిగి పొమ్మని మానేరుకు జెప్పింది
ఎములాడ రాజన్ననూ, భీమన్ననూ ఎగరేసింది
ఎలగందుల ఈరన్న మీసం మెలిబెట్టింది
ధర్మపురి నరసన్న జూలు దువ్వింది
కాళన్నను ముత్తన్నను కదిలించింది
సబ్బినేలమ్మను మట్టిగంధం తీసి
ఉద్యమ వీరుల ఊపిరికి తిలకం దిద్దమన్నది
ఉడుకు నెత్తురు పోరగాండ్లను వురుకుమన్నది
నడీడోళ్లను నడువుమన్నది
ఆడోళ్ళను అల్లరి చెయ్యమన్నది
ముసలోళ్ళను ఉసిగొల్పుమన్నది
పిల్లాదిమారం ఒక్కటై
లొల్లి లొల్లి జెయ్యమన్నది
తెలంగాణ తడాఖ జూపుమన్నది.

---

1953, ఎలగందుల, కరీంనగర్ మండలం.

# తల్లీ నీ కోసం...

- సంగెవేని రవీంద్ర
09987145310

దశాబ్దాలుగా నీ గుండె పొరల్ని
కాటేస్తున్న గాయాలను లెక్కించాలని ఉంది..
అంతా బావుందనీ మనమంతా ఒక్కటనే
వంచన తెరల్ని దించాలని ఉంది..
తల్లీ..
ఎన్నేళ్లుగానో కన్నీళ్ల ఖైదీలో ఉన్న
నిన్ను ఉన్నపళంగా విడిపించాలనీ ఉంది..
నీ రొమ్ము తాగి రక్తం పీల్చిన పెత్తందార్ల గుత్తాదిపత్యం



నిన్నింకా మభ్యపెడుతూంటే..
సలసలకాగుతున్న నా రక్తకాసారంలో వాళ్ళని
మలమలమాడ్చాలని ఉంది..
నిన్నటి దాకా నిత్యం నిన్ను వెన్నుపోటు పొడిచిన
మేకవన్నె పులుల కోరల్ని తుంచాలని ఉంది..
నీ స్వేచ్ఛ కోసం..
నేను ఉరికొయ్యల్ని ఎంచుకున్నాను..
నీ సాధన కోసం..
నా ఊపిరిని యజ్ఞసమిధను చేశాను..
ఉగ్గుపాలతో నీవు నేర్పిన యుద్ధవిద్యతో..
నిన్నటి దాకా అంతర్గత విద్రోహుల్ని
అంతమొందించాను..
పగలంతా నీ స్వాభిమాన భారాన్ని భుజాన వేసుకొని
నడిరాతిరి నీ గుండెని స్వార్థం మార్చూరీలోకి
గిరాటేసే కిరాతకుల్ని బహిష్కరించాలనీ ఉంది..
విపక్షకు దోపిడీ వ్యవస్థకు మధ్య
గిలగిలలాడుతున్న నీ భుజకీర్తులకు
మెరుగులు అద్దాలనీ ఉంది..
కుతంత్రాల క్రీడల నీడల్లో..
నీ అస్తిత్వ పోరాటంలో అనుక్షణం
వెన్నుపోట్లకు గురవుతున్న నా కన్నతల్లీ..
నీకు శత్రువుల్లుండే కాదు..
శత్రువుల్లాంటి మిత్రుల్నుండి కూడా
విముక్తి కలిగించాలనీ ఉంది..!

---

శెకల్ల, గొల్లపల్లి మండలం.

## రంపెకోత

- నాంపెల్లి సుజాత
98480 59893

ఒద్దు బిడ్డా ! ఒద్దు
ఫలితం లేని పనది
ఏం తప్పు చేసినవని రాలిపోతన్నవ్!?

ఇయ్యాల గాకుంటే రేపు
గిట్ల గాకుంటే ఇకో తీరుగ
నిండు జీవునం మల్లరాదు బిడ్డా !

అర్వైఏండ్ల నుంచి ఆగమై ఆల్మటిస్తన్నం
నువ్వింకింత అంపె కోత కొయ్యకు
కప్పెడు గంజి పోత్తవనుకుంటే
కాట గలిపి పోవడితివి
పాణం అవుశిపోతంది
పిట్టలోలె రాలిపోతండ్రు
జెర నిమ్మలంగ ఆలోచించు తండ్రీ!



నల్లగొండ బిడ్డ శ్రీకాంత్ ఏం సాధించిండు ?
భగభగ మండి బుగ్గైండు!
తిరిగి రాని లోకానికిపోయిండు
వందల గుండెలాగినయి
వచ్చిందా.. మరి ... ఇచ్చిండ్రా!?
ఈ రాజకీయ చదరంగంలో నువ్వెందుకు పావైతవ్!?

నువ్ రాలినా, కాలినా
బండరాళ్ళకు చెమ్మ పుట్టదు
ఎండమావులల్ల నీల్లుండయి
పీనుగ మీద పాలాలేరుకునే గుంటనక్కలకు
మీ సావులన్నీ పరాష్కాలైతన్నయి

ఢీలా పడకు బిడ్డా! భోళావైపోకు
నీ నెత్తుటికి రజాకార్లనెదిరించిన చరిత్రుంది
నీ ఊపిరికి సమ్మక్క సారక్కల బలముంది
నీ గోరుముద్ద ఓరుగల్లుఖిలది బిడ్డా!
నీది నువ్ తెచ్చుకునేతందుకు
చచ్చిపోవాల్నా!

నువ్వే సూడనప్పుడు ఈ త్యాగమెవ్వరి కోసం!?
భయపడితే భయపెడతరు
ఒక్క చెంప కొడితే ఇంకో చెంప
సూపిచ్చే రోజులు గావు బిడ్డా!
గద్దిరించు... గాండ్రించు
పులి పిల్లోలె తిరుగపడు
వచ్చి తీరుతుంది...
ఖచ్చితంగా మన కలల తెలంగాణ.

---

1964, పోతారం (ఎస్), హుస్నాబాద్ మండలం.

## మన రాష్ట్రం

-సదానందం శ్రీమంతుల(సదాశ్రీ)
9290088384

మనం మనం ఒక్కటైతే
కలం బలం మనకైతే
జనం దళం మనమైతే
మేధావి వాది జమైతే
ఆట–పాట మనదైతే
పోరుబాట మార్గమైతే
ధూం..ధాం....

తల్లి తెలంగాణ మెచ్చె
బల్లున తెల్లారకముందే
ప్రత్యేక రాష్ట్ర మొచ్చి తీరుతుంది.

ఏ కొంచెం క్రోధ మద్దురా!
మన ప్రయత్నమే మనకు ముద్దురా!

సమర శంఖమూదరా!
అమర వీరుని సాక్షిగా...

శ్రీకృష్ణ కమిటి కబురు
కాకకమ్మ కథలని నమ్మురా!

ఏది ఏమైనా మన పార్టీ ఏదైన
జండాలు వేరయినా
ఏ జండా ఒకటేరన్నా

అది తెలంగాణ రాష్ట్రమేరన్నా !
ఇది స్వరాష్ట్ర ఉద్యమంగాను సందేశమే రన్నా!
జై తెలంగాణ  జై జై తెలంగాణ

---

1976, కొమిర, ఓదెల మండలం.



## దుష్ట కౌగిలి

-ఎస్. వేణుశ్రీ
9440064033

ఇది వేర్పాటువాదం కాదు.
ప్రాంతీయవాదం అసలే కాదు.
రెండు ప్రాంతాల వారి దోపిడి కుట్రలకు
చరమగీతం పాడే జీవన్మరణ పోరాటమిది.
అరువది ఏండ్ల నుంచి తెలుగు తల్లి
బిడ్డలు అసమానతల బ్రతుకు నీడుస్తుంటే
ఆంధ్ర నాయక కాకులు
రాయలసీమ నాయక రాబందులు
సమైక్యవాదమని మొసలి కన్నీరు కారుస్తున్నాయి.
రంకునేర్చిన వారు బొంకు నేర్చినట్లు
మొగన్ని కొట్టి మొత్తుకున్నట్లు
సమైక్యత అని ఓండ్ర పెడ్తున్నారు.
విద్యార్థులు ప్రజలు
తెలంగాణ కోసం ఉద్యమిస్తున్నారు.
ఉత్తరాంధ్ర, రాయలసీమ వాళ్ళు
కోస్తా వాళ్ళతో కలిసి ఉండలేమంటున్నారంటే
మీరెంత సమైక్యవాదులో
మా తెలంగాణను దోపిడి చేయడమే
మీ సమైక్యవాదము కర్తవ్యమా
కాంగ్రెసు వాళ్ళు – తెలుగుదేశం వాళ్ళను
తెలంగాణ వాళ్ళు గెల్పించింది
సమైక్యవాదం కోసం కాదు
తెలంగాణను ఇస్తామనే ఎన్నికలలో వాగ్దానాలు

కురిపించినందుకు
కాని దింపుడు... వాగ్దానమైంది
ఈ విషయాలను వక్రీకరించి
తెలంగాణలో సమైక్యవాదంకే
ఓట్లు వేసారని జబ్బలు చరుచుకుంటు
బొచ్చెలు గుద్దుకుంటూ ఆగమాగము మాట్లాడే
వంకర బుద్ధి.
నక్కల్లారా! తోడేల్లారా! రాబందుల్లారా!
దుష్ట ధృత రాష్ట్ర కౌగిలి మీదిరా!
అందుకే నేను చెబుతున్నాను
ఇది వేర్పాటు ఉద్యమం కాదు.
మీ నక్క వినయపు మాటలు
కపట ప్రేమలు కురిపిస్తు
డ్యాంలు మా ప్రాంతంలో కట్టిస్తారు.
పారే నీరు మీ ప్రాంతపు పంటలకు
ఉన్నత ఉద్యోగాలు మీ వాళ్ళకు
మామూలు ఉద్యోగాలు మా వాళ్ళకు
ఎంత కాలం - ఎంత కాలం
ఈ దోపిడీ
విడిపోదామంటే - కలిసి ఉండాలని
ఉద్యమాలు చేయడంలోనే
మీ నీచ నికృష్ట దోపిడీ పొత్తులు
అర్థమౌతున్నాయి లోకానికంతటికి
ఇకనైనా సోదరులుగా
విడిపోయి వైషమ్యాలు లేకుండా
మనుషులుగా జీవిద్దాం.
గబ్బిలాలుగా తెలంగాణ పట్టుక
చూరులకు వేలాడకండి.

---

1955, నందగిరికోట్ల, గంగాధర మండలం.



# మూల సుక్కలు

- డా॥ బి.వి.ఎన్.స్వామి
9247817732

గుమ్మలనీ నిండినచోట
నీల్లు పుష్కరాలై పూజలంది
పీఠభూమికి పోటు పొడిచె

బొబ్బిలి బ్రహ్మన్న వెలుగు
సర్వాయి పాపన్న మరుగు
వెలుగు-మరుగుల మర్మమేందో!

భాష యాసై
జొన్న ఇడ్లయింది
ఎనగర్ర ఇరిగింది.

కోటిలింగాల కొలిమిలోకి
అమరావతి అందలానికి
ఏమి నీతిరా నీది.

పూబంతిగా పేర్చిన బతుకమ్మకు
ఏ పొలకుడూ
ఒక్క పువ్వును తురుమకపాయె.

ఆకలేస్తే మాకు వలస
అధికారానికి మీకు వలస
ఐక్యతకు చోటెక్కడ.

పది జిల్లల ప్రజాకాంక్ష
అసెంబ్లీలో అర్థసత్యం
చరిత్రలో నగ్నసత్యం.

మంటలతో మాట్లాడించి
గుండెలు మండించిన
త్యాగులకు జోహార్

---

1964, వరికోలు, కోహెడ మండలం.

## పిచ్చితల్లి

- డా॥ డింగరి నరహరి ఆచార్య
9866650184

అవ్వా! అని పిలిస్తే
ఆప్యాయత పంచేది
ఏ బిడ్డైనా
ఆకలితో అలమటిస్తే
తన రొమ్ము అందించే గుణం
ఎండన పడివస్తే
చల్లటి మజ్జిగ దాహం తీర్చేది
తాను గడక తిని
వరి బువ్వ వండించే ప్రేమమూర్తి
కడుపులో పెట్టుకొని
కరుణ చూపే తత్వం
అమ్మ అంటే ఇలా ఉండాలనే
అసలు సిసలైన స్వరూపం
గలగలపారే వాగులతో
పచ్చని పంట పొలాలతో
బంతి పూల గుమ్మాలతో
బాగైన మనస్సులతో
వాకిలి తొక్కిన వాడెవడైనా
తన వాడేనని మురిసే
అచ్చంగా ఆదిశక్తి స్వరూపమైనా
అమృతం కురిసే చల్లదనం
అందాల బంగారు కొండ
అన్నీ నిండిన నిండు కుండ
నా తెలంగాణ తల్లి
అచ్చంగా పిచ్చి తల్లే



బొంకులూ రంకులూ లేని
బోళాతనం కల్గింది
అమాయకత్వం ఆసరా చేసుకుని
అక్కర తీర్చుకోను వచ్చి
అవ్వా అంటూనే దగ్గర చేరి
నేనూ నీ బిడ్డనే అంటూ
నేడు ఈ గడ్డ నాదంటున్నాడు
పంచన చేరినట్టే చేరి
వంచన నేర్చుకున్నాడు.
చుట్టంలా వచ్చినట్టు వచ్చి
పాము చుట్టలా చుట్టేస్తున్నాడు
పెట్టిన కూడు తింటూనే
వాసాలు లెక్క బెడుతున్నాడు
ఉన్నదంతా దోచుకుంటూ
ఊపిరాడకుండా చేస్తున్నాడు
ఊరుకుంటే ఊరంతా తనదేనట
నాతల్లి ప్రేమ పిచ్చిదే కావచ్చు
గిచ్చితే ఊరుకునేది కాదు
తప్పటడుగేస్తే తన్ని తగిలేస్తది
తొవ్వ దప్పి నడిస్తే
తోసేస్తది బయటికి
తప్పుడు కూత కూస్తే
ముప్పు తిప్పలు పెడుతది
మంచికి ప్రేమ పంచుతది
దుర్మార్గులకి దుర్గవుతది
పిచ్చితల్లి కాదు
స్వచ్ఛతకు మారుపేరు
కళ్ళు తెరచి నడువండి
ఖబర్దార్ ఇప్పటికైనా.

---

1948, మల్లారం, వేములవాడ మండలం.

# ఓటమినెరుగని తెలగాణ

- చెఱకు సత్యనారాయణరెడ్డి
9492136195

ఉద్యమం సృష్టించబడదు
తనకుతానై సృష్టించుకుంటుంది.
పరిస్థితులకనుగుణంగా అది
పరిణామం చెందుతుంది.

ఉపన్యాసాలిచ్చేవాళ్ళు
ఉద్యమకారులు కారు.
పైసలు పంచి ఎగేసేవాళ్ళు
ప్రజా నాయకులు కారు.
కాని ఉద్యమంలో నేలకొరిగినవాళ్ళు
భవితవ్యాన్ని దర్శింపచేసే వెలుగు దివ్వెలు

పరిస్థితులు విశమించినా
ఉద్యమం ఊపులో వుందంటే
పరీక్షలకు నిలుస్తుందని అర్థం
అది తనకుతాను
పరిరక్షించుకునే దిశగా
పరిణామం చెందుతుందని అర్థం

ఉద్యమం ప్రజల ఊపిరిల్లోంచి పుడుతుంది
ఊదితే పోయేందుకది
ఉపయోగం లేని నీటి బుడగ కాదు
నేలలోకి దిగబడే వూడలా
జనహృదయాల్లోకి చొచ్చుకెళ్ళే
క్రాంతివంతమైన రామబాణం.
వర్తమానం నుండి సూటిగా



భవిష్యత్తులోకి చొరబడే
ఆలోచనల నారాయణాస్త్రం
ఉద్యమం విద్యుత్తులా ప్రసరిస్తుంది.
వేయి ఆలోచనలను
వికసింపజేస్తుంది.
జావగారే ఉద్యమానికి
జవసత్వాలున్న ఉద్యమానికి
చేరాలు తెలుసుకోవడం కావాలిప్పుడు
న్యాయం నుండి పుట్టిన ఉద్యమానికి
అవసరార్థం ఏర్పడిన ఉద్యమానికి
అంతరం దెలవాలిప్పుడు

వరిగడ్డిమంట వాళ్లేందుకు
వర్షం అవసరం లేనట్లే
పెట్టుబడిదారీ వుద్యమాన్ని
పెద్దగా పట్టించుకోనవసరమూలేదు
అన్నదమ్ముల్లా విడిపోదామనడం
అసలు తప్పుకాదే
పవిత్రబంధాలను మేము
పాశవికంగా నులమాలనుకోవడం లేదే
అయినా రాజునెదిరించిన మాకు
రాజకీయ నాయకులోలెక్కా
ఇప్పుడు అరవై సంవత్సరాల
నా తెలంగాణ వుద్యమం
శివమెత్తిన శివుడైపోయింది
గరళం మింగిన శంకరునికి
అంతకన్నా ఉపద్రవం లేదు
అరవై సంవత్సరాల ఉద్యమాన్ని
ఔపోసన పట్టిన నా తెలంగాణ
ఓడిపోదు.

---

1949, స్టేషన్ కొత్తపల్లి, పెద్దపల్లి మండలం.

## శవం సాక్షిగా

- దాస్యం సేనాధిపతి

ఓయూలో
శవం సాక్షిగా... కొందరు
నేతలు చేసిన బాసలు
అయ్యాయి నీటిపై రాతలు!
ప్రగల్భాలు
పలకడంలో వారు ఉత్తర కుమారులు !
రంగులు
మార్చడంలో ఊసరవెల్లులు !
ప్రజలు కాదు..
వారికి కావలసింది పదవులు !
ఉద్యమాల పేరుతో...
యువలోకాన్ని ఉసిగొలుపుతారు
ఆ తర్వాత..
ఊరుకు ముఖం చాటేసి
గద్దెలు పట్టుకుని ముద్దాడుతారు !



జనం ఛీ కొట్టినా..
దున్నపోతుపై వాన పడిన చందంలా
కుర్చీలు పట్టుకొని వేళ్ళాడుతారు!
చిలుక పలుకులు
పలుకుతూ...
గోడ మీది పిల్లిలా మసలుకుంటూ
కాలం వెళ్ళదీస్తారు!
దశాబ్దాలుగా
సాగుతున్న తెలంగాణ ఉద్యమాన్ని
స్వార్థం కోసం తాకట్టు పెడతారు !
పూటకో మాట మారుస్తూ
ఏం చక్కా
మొసలి కన్నీరు కారుస్తారు!
అట్టడుగు, అనగారిన బిడ్డలే...
ఉద్యమ బలోపేతానికి
అవుతున్నారు సమిధలు!
అగ్ర నేతల...
అనుంగు సంతానం మాత్రం
ఆత్మ బలిదానాలకు
ఆమడదూరం!
ప్రజలు గమనిస్తున్నారు...
ప్రజా ప్రతినిధుల
ద్వంద్వ విధానం!
త్వరలోనే...
వారికి బుద్ధి చెబుతారు జనం!

---

1955, నిర్మల్, జి॥ ఆదిలాబాద్.

## తెల్లారలేదు

- డా॥ గంద్ర లక్ష్మణరావు
9849328036

తెలంగాణకింకా తెల్లారలేదు
తెలంగాణమింకా చల్లారలేదు
తెగించి నిలిచిన విద్యార్థుల
నినాదమింకా ఆగిపోలేదు
ఆంధ్రుల అధికార పెత్తనంతో
అరవై ఏళ్ళుగా అలుముకున్న చిమ్మచీకటి
అరునెలల పోరాటం కాగడాలతో తరిమెను
అడుగడుగున ఉద్యమం అగ్గివానలా కురిసెను
ఉస్మానియా విద్యార్థులు ఉవ్వెత్తున లేచినారు
తెలంగాణ తేవాలని తెగబడి పోరాడినారు
లాఠీలకు తూటాలకు లగడపాటి వేషాలకు
రాపిడ్‌ఫోర్స్ దళాలకు రవ్వంతయు జడియలేదు
జై తెలంగాణ జై జై తెలంగాణ జవాబుతో తరిమినారు
చావైనా రేవైనా ఇప్పుడే తేలాలి



సమరం మాయికుల పెత్తనాలు వదిలించక
తెలంగాణ జనమంతా ఉప్పెనయై కదిలింది
తెలంగాణ తల్లికొరకు రేపటి తమ్ముళ్ళకొరకు
ఆత్మత్యాగాలు చేసి అమరులై వెలిగినారు
దారులన్ని తెలంగాణ బతుకమ్మలు ఆటలు
ఊరూరా తెలంగాణ బోనాల జాతరలు
పల్లె పల్లె పట్టణాలు లొల్లి లొల్లి ధూం ధాం
డప్పులు డోళ్ళు గజ్జెలు తెలంగాణ నినాదాలు
పాఠశాల కళాశాల ప్రభుత్వ కార్యాలయాలు
బస్సులు రైళ్ళు బండ్లు పయనించే వాహనాలు
కులాలు మతాలు వృత్తులు మొత్తంగా ఉరికినారు
దళాలు దళాలుగా దండయాత్ర సాగినారు
పాలుదాగు బిడ్డ మొదలు పాడెనెక్కు ముసలివరకు
ఉపాధి కూలీ మొదలు ఉద్యోగస్థుల దాకా
జై తెలంగాణ జై జై తెలంగాణ
అయినా ఢిల్లీ పెద్దల సీమాంధ్రులు నమ్మించిరి
కమిటీ పేరిట కొంత కారు మబ్బు కమ్మించిరి
జనం గుండెలో నేటికి తెలంగాణ నినాదమే
సగం నిదురలో కూడా తెలంగాణ కలవరమే
అదునుకోసమై బెబ్బులి నాచుపెట్టుకొన్నట్టు
తెలంగాణ సమరభేరి సిద్ధంగా వేచి ఉంది
కూడళ్ళన్నీ ఇప్పుడు నివురు కింది కుంపట్లు
వాడలు గోడలు నేడు కడలికింది బడబాగ్ని
తెలంగాణమున కింకా తెల్లారనేలేదు
తెలంగాణజనమింకా చల్లారనే లేదు.

---

1951, పెగడపల్లి.

## జై తెలంగాణా

- బాలసాని రాజయ్య
9441970025

ఓ ప్రభుత్వమా ! మా
తెలంగాణా వైపు చూడు–
తెగులు పట్టుకుంది.
పంట భూములు
బంజరు బీళ్ళవుతున్నవి,
శ్రమ జీవులు శక్తిని కోల్పోతున్నరు,
అంతర్గాం కార్మికుల
అవస్థలు చూడు,
గోదావరిఖని శ్రామికుల
గోడును విను,
కరీంనగర్ కరువు
పసిపిల్లల మరణాలు,
మెతుకు లేక మెదకు జిల్లా,
నీళ్ళు లేక నిజామాబాద్
అడవి బతుకుల ఆదిలాబాద్
వరంగల్లు అలజల్లు
నల్గొండ నల్లరాళ్ళు
ఖమ్మం కడుపు మంటలు
రంగారెడ్డి రంది
మహబూబ్‌నగర్ మధనపడుతున్నది
హైదరాబాద్ కల్తీ బతుకులకు కాలం చెల్లింది
ప్రభుత్వమా! తెలుసుకో, సింహాలమై గర్జిస్తం,
ప్రత్యేక తెలంగాణ సాధిస్తం.

1970, కొత్తపల్లి, పెద్దపల్లి మండలం.



## మీ అమరత్వం పొద్దు పొడుపు

- ముక్కెర రాజు
9440545576

తెలంగాణ పోరులో
అమరులైన వీరులారా
మీ అమరత్వం మాకు పొద్దు పొడుపయింది
మీ కాలుతున్న శరీరాలు మా మండే గుండెలకు ఆజ్యమైనయి
మీరు కార్చిన రక్తం తినే కంచంలో ప్రతిబింబమయి
మా కళ్లు రక్తాన్ని కారుస్తున్నయి
ఇంకా...
నిరుత్సాహంతో – నిట్టూర్పులతో
నిశ్శబ్దంగా ఎలా వుండగలం?
నిరసించడాన్ని నీరసింపజేసే ప్రయత్నం ముమ్మరమయి
ప్రజల ఆకాంక్షల్ని పాతరేయాలని చూస్తూ
ఆఖరుకు మా వీరుల అమరత్వాన్నే ప్రశ్నిస్తుంటే
మహా ఉప్పెనలా కదలకుండా
మౌనంగా ఎలా వుండగలం?
అందుకే
సీమాంధ్ర వలస పాలకులారా!
మా అహింసా పోరాటం
త్యాగాలకు పూనుకోకముందే
మా ఆరాటం ఫిరంగులై
శత్రు శిబిరాలపై నిప్పులు కక్కకముందే
మా రాష్ట్రాన్ని మాకు వదిలేయండి.

1970, జాగీర్‌పల్లి, సైదాపూర్ మండలం.

## తరుము

-సామ లక్ష్మారెడ్డి
9948357595

మన కళ్ళముందె మన ఇల్లుకొల్లగొడుతుండు.
మన నోటి ముందు బుక్క ఎత్తగొట్టి తింటుండు.
మన సొమ్మును దోచు వాని తరిమి కొట్టు తమ్ముడా.
తెల్లదొరల తరిమినట్టు తరుముర తెలుగోడా

మంచి చెడ్డమన తోనే పంచుకుంటు ఆడుతుండు
ఎంచి చూడ మన ప్రక్కలొ బల్లములా గుచ్చుతుండు
ఎంతో కాలముంటె వాడు మనల బతుక నివ్వడు
అందరమొకటైననాడు ఎక్కడోడు అడికేగు

గలగల పారేటి గంగ మన ముంగటి కెల్లి పోంగ
మన పొలాలు చేనులెండె నీటి చుక్క కరివేగా
ప్రక్కనున్న వాని పొలం పండెనెంతొ నిండుగా
ఏరుమనది, నీరు మనది, ఊరు మనది పేరు మనది

---

1946, యాస్వాడ, కరీంనగర్.



## యుద్ధం

-గోస్కుల రమేష్
9849366482

యుద్ధం యుద్ధం
ఇది తెలంగాణ యుద్ధం
చేసుకున్న ఒప్పందాన్ని
కాలరాసినందుకు యుద్ధం.
వనరులన్ని దోచేసి
మన్ను చేతిలో పోసేవారికి
వ్యతిరేకంగా యుద్ధం.
అధికారాన్ని గుప్పిట్లో
పెట్టుకొని ఇతరులను ఎదగనీయని
తీరు పై యుద్ధం.
ఇద్దరు ఏకమై ఇతరున్ని
దోచే దుష్టత్వంపై యుద్ధం.
ఎన్నో అవమానాలకు
ఒక్కటే విరుగుడైనప్పుడు
సాగిద్దాం యుద్ధం.
ఆ యుద్ధంలో సైనికులు స్వచ్ఛందం
అది నిర్బంధానికి వ్యతిరేకం.
కాని అంత నిర్బంధమే
ఆ నిర్బంధాన్ని వదిలించు
కోవడానికే యుద్ధం.
ఆ యుద్ధం ప్రజాస్వామ్య బద్ధం.
ర్యాలీలు, ధర్నాలు,
బంద్‌లు, రోకోలు
ఇది తెలంగాణ స్వేచ్ఛకై గడపగడప
చేసే యుద్ధం.

---

1976, ఇప్పల్‌నర్సింగాపూర్, హుజురాబాద్ మండలం.

# ఉద్యమ లక్ష్యం

- రేగులపాటి కిషన్‌రావు
9849246980

కలిసి ఉంటె కలదు సుఖం
అంటుంటాం వింటుంటాం
మాట తీపి చాలదులే
సమత బాట వీడితిరే.
అరశతాబ్ది పాలనలో
అంతరాలు ఎలా వచ్చె?
విభేదాలు ఎలా సొచ్చె?
సమైక్యంగ మనముంటె ప్రయోజనం ఇదేనా ?
నియమాలను పాటించక
సమధర్మం పాటించక
కలయునాటి ఒప్పందం
కారడవికి పంపిస్తే
కలిసుండాలా? ఇంకాకలిసుండాలా ?

కరువులతో కుములువారు
చిరకాలం చింతలతో
కష్టాలతో కన్నీళ్ళతో
చితికిపోయి బ్రతకాలా?

బలవంతుల ఆగడాలు
రివాజుగ సాగుతుంటె
ఇదుముల పాలగుపారలు
క్రోధాగ్నిలో రగిలి రగిలి
కదిలి కసితో కల్లోలం
కలిగించక మానేరా ?
అన్యాయం అరాచకం

తొలగించే ధ్యేయంతో
ఉరిమి ఉరిమి ఉద్యమించి
దగామతుల దురాకృతం



నిఘావేసి వెలికి తీసి
ధిక్కరించకుండేరా ?

నాటి నుండి నేటి వరకు
సమత నియతి పాటిస్తే
సౌజన్యం చూపిస్తే
వచ్చేవా ఇన్ని ఇన్ని
తగాదాలు విభేదాలు ?

మాటతప్పి నీతి తప్పి
నియతి తప్పి పోతుంటే
పాలకులే దారి తప్పి
పాలన సాగిస్తుంటే
మనసు మండినోళ్ళందరు
తెలిసి ఊరకుంటారా
బెదిరిస్తే బెదిరిపోయి
నోరు మూసుకుంటారా?

సాగదింక సాగదింక
వక్రనీతి పాలనం
అణగారిన తెలంగాణ
ఉద్యమాలు చేస్తున్నది
ముందు ముందు మిక్కుటముగ
ఉద్యమించ రానున్నది
అణచాలని యత్నిస్తే
ఉప్పెన మరి కానున్నది

సౌజన్య స్థాపనకై
శాంతి క్రాంతి నిలుపుటకై
నీతి నియతి దారిలోన
చెలిమికోరి విడిపోదాం
బ్రతుకు వృద్ధి సాధిద్దాం
సకల జనులు సుఖియించే
మార్గాలను శోధిద్దాం

---

1946, చింతల్‌ఠాణా, సిరిసిల్ల మండలం.

## సమాంతర రేఖ

- కె.ఎస్. అనంతాచార్య
9441195765

రెండు ఆలోచనల మధ్య తేడాలు
రైలు పట్టాలపై ప్రయాణిస్తూ
అరవై ఏళ్ళ సంగ్రామం చేస్తూ
నిరీక్షిస్తున్న కన్నుల సాక్షిగా

భాషాబేధం ప్రస్ఫుటమై
సమాంతర రేఖకు ఇరువైపులా నిల్చి
అంగీ గుండీలు, చొక్కా బొత్తాలకు
మధ్య సరిపోని కొలతల బేరంలోంచి

గుండె మంటల్లోంచి



ఎగిసిపడే అగ్ని శిఖలు.
సంస్కృతీ నాగరికతల
ఎదురుదాడిని తిప్పికొట్టే దృశ్యంలోంచి

నీటి ప్రవాహాలను
ఏటికి ఎదురీదించే ప్రయత్నంలో
కన్నీటి వెతలు.
రైతుల ఉరితాళ్ళ కథలైన సందర్భంలోంచి

ఆరున్నర శృతిలో
ఎన్నెన్నో రాగాలు.
కచేరీలో 'తెలంగానం' చేసి
జనని తెలగాణతల్లికి
సమర్పించిన నివేదనల్లోంచి
ప్రతి గాయంతో
చిక్కబడ్డ రక్తం.
ఒరిపిడిలో
రాటుదేలిన దేహం.
ప్రతి వ్యూహంతో
ప్రజ్ఞాశీలతతో వేసే అడుగులు.
అరవై ఏళ్ళ ఉద్యమంలో
నేలకొరిగిన అమరులు.
ఆత్మబలిదానాల్లోంచి
ఆరేళ్ళ చిన్నారి నుండి
పండు ముసలివారిదాకా
ఈ నేల ఈ దేహం నినాదం
జై తెలంగాణా... జై తెలంగాణ !!

---

1963, కరీంనగర్.

## తెలంగాణ తల్లి ఎతలు

- డా॥ అడువాల సుజాత
9989558678

తల్లడిల్లుతుంది
తల్లి తెలంగాణ ఎతతో
తెలంగాణ కోటి
రతనాల వీణ అప్పుడు
ఇప్పుడైతే..
తీగ తెగిన వీణ
ఈ తల్లి ఎద కోత
ఇసం కువ్వారం లేనోళ్ళు
అమాయకులు తెలంగాణ తెలుగోళ్ళు.
ఇటిటు రమ్మంటే
ఇల్లంతా నాదని
మాది మాకు గాకుండా జేస్తుంద్రు.
నీళ్ళు లేకపాయే
నిలువ భూమి లేకపాయే
చాకిరీ మా పాలాయే.
మాట నచ్చకపాయే
భాష యాసాయే.
తెలంగాణ తెలుగంటే
ఇంపుసొంపుల గుర్తి



సింగారాల బుడ్డి
గుండాల మాటనుకున్నారా!
తెలంగాణ తెలుగులో ఉన్న
ఎద మెత్తని తనం
కల్తీలేని కన్నతల్లి
ప్రేమసొంటిది.
మా మంచి తనాన్ని
మా అమాయకత్వాన్ని
ఆసరా చేసుకొని
అణిచేసింద్రు.

ఇప్పుడు
మా ఎదలో
నిప్పుల కుంపటి
రాజుకుంది. రగులుకుంది.

ఈ మంటలలో
మా నెత్తురు మసులుతుంది.
అడ్డమొచ్చినోన్ని
అడ్డంగ నరుకుతం.
ఎదురు తిరిగినోన్ని
యమలోకానికి పంపుతం.
ఒక్క మూటి
ఒక్కమాట మీదుంటం.
తెలంగాణ గడ్డమీద
పులి బిడ్డలం మేం.
తెలంగాణ తల్లి ఎత
తీరే దాక పోరాడుతం.

---

1970, జగిత్యాల.

## ఎడతెగని కల - తెలంగాణ నేల

- కె. విజయనర్సింహారావు
9885777585

ఎడతెగని కలల హేల మా తెలంగాణ నేల
మట్టిమమతతో మానవీయతను పండించిన నేల మా తెలంగాణ నేల

కపటములే నీ కష్టజీవులా ఉద్యమాల నేల మా తెలంగాణనేల
అడుగడుగున దోపిడి చెదుగులనూ కదుగునట్టి నేల ॥ మా తెలంగాణ నేల॥
ఉద్వేగ భరితమే త్యాగనిరతితో స్వేచ్ఛకోరు నేల మా తెలంగాణ నేల

కొమురంభీము దొడ్డి కొమురయ్యల కన్నతల్లి నేల మా తెలంగాణ నేల
గుండె నెత్తురుల నేల నలికిన త్యాగధనుల నేల మా తెలంగాణ నేల

ప్రజాకవీ కాళోజీ గుండెల చప్పుడు ఈ నేల మా తెలంగాణ నేల
ప్రజల హక్కులను సాధించుటకై రణము చేయు నేల మా తెలంగాణ నేల
బందగీలు ఐలమ్మలెందరో సామాన్యులెందరో బిడ్డలైన నేల మా తెలంగాణ నేల

ఊరు ఊరు ఒక పోరుగడ్డగా వేరువడ్డ నేల మా తెలంగాణ నేల
చరిత్రనరయని చెత్తగాండ్ల పెనుమత్తుదించునేల మా తెలంగాణ నేల
ప్రజాయుద్ధముకు వేగుచుక్కగా భరతమాతకే ముద్దుబిడ్డగా
ప్రజాస్వామ్య ఘన ఆశయాలు చాటిచూపిన విప్లవాల నేల మా తెలంగాణ నేల
నేలతల్లికే పేదరైతుకీ చెమటబొట్టుకీ చేనుతళుకుకీ
అవినాభావం అనుబంధప్రజల ఆత్మగల్ల నేల మా తెలంగాణ నేల
ప్రతి పల్లే బతుకమ్మ పాడునట్టి నేల మా తెలంగాణ నేల
పోరు అలల ఈ నేల కదలి ఎడతెగని కలల హేల మా తెలంగాణ నేల

---

1951, గుండి, కరీంనగర్ మండలం.



## సాధన

- స్వాతి శ్రీకర్
09343399904

ఎప్పటినుండో రగులుతున్న ఆవేశం
ఇప్పుడు కడుపు నుండి తన్నుకొచ్చింది
ఇక ఈ ఉద్యమం ఆగదు
సాధించే వరకు సాగుతుంది.

విద్యార్థులు కన్నెర్ర చేసారు
రైతులు ఉద్యమసాల్లు మన్నుతున్నారు
అన్ని పనులు వాల్లు ఆలోచించారు
రాజకీయ నాయకుల్లోనూ ఆవేశం వచ్చింది
అలా కదిలింది, నేలంతా పోరాట చిత్రాలే.

మా నీళ్ళను, మా బొగ్గును
దొబ్బి తినేటోల్లను
దెబ్బకొట్టి తీరుతాం
ఇక మోసపోయింది చాలు
ఇంకా ఎడ్డోళ్ళం కాదు
లడాయి చేస్తం.

ఏ కృష్ణ కమిటీ అయినా
తెలంగాణ ఇయ్యమని సవాల్ చేస్తం
ఉరిమి ఉరిమి చూస్తం.

ఎన్ని లంగపాటి నాటకాలైనా
తరిమి తరిమి కొడతాం
తెలంగాణను
మేం సాధించుకుంటాం.

---

1986, పోతారం (ఎస్), హుస్నాబాద్ మండలం.

## తెలంగాణోళ్ళం మేము !

- డింగరి ప్రశాంత్
9492313130

తెలుగోళ్ళం మేము
తెలంగాణోళ్ళం మేము
ప్రేమకు చిరునామా మేము
నమ్మకానికి నజరానా మేము
మా నీళ్ళు దారి మళ్లుతాయి
మాకు రావాల్సిన నిధులు దారి మళ్లుతాయి
మాకేమో కన్నీళ్ళు మిగుల్తై.
మా కూడు తింటరు

మా గూడులో గురక పెట్టరు
మా జాగలనే కబ్జా చేత్తరు
మా మట్టి గూడ మాకు మిగిలిత్తలేరు
అయ్యా ! బాంచన్ అంటే
అలుసుగా సూత్తరు
అరేయ్ ! భైంఛత్ అంటే
చేతులకు గొలుసులేత్తరు
తెలుగోళ్ళం మేము



తెలంగాణోళ్ళం మేము
త్యాగానికి సంకేతం మేము
ధైర్యానికి నిదర్శనం మేము

మా కాడ  గుళ్ళున్నవి
మా కాడ బళ్ళున్నవి
కాని మా కాడ
మా జీవితాలే సుడిగుళ్ళు
మా కాడ రైతన్నలున్నరు
మా కాడ నేతన్నలున్నరు
మా కాడ మేధావులున్నరు
మా కాడ కార్మికులున్నరు
మా కాడ యోగులున్నరు, యోధులున్నరు
కాని దొంగముచ్చులు వచ్చి
దోస్కపోతావుంటే
బిక్కుమని మావోళ్ళు
ఉరికొయ్యల్లో నిట్టనిల్లిపోతాంద్రు

కానీ
మా సహవాసమే సహనం
మా శ్వాసే శాంతి నివాసం
మా జీవనం ప్రేమమయం
మా నమ్మకం మాది
మా తెలంగాణ వచ్చి తీర్తది
తెలంగాణ మాది
తెలంగాణోళ్ళం మేము
తెలంగాణోళ్ళం మేము !!!

---

1977, కోరుట్ల.

## తెలంగాణ

- గద్దె శంకరాచారి
9949442126

తెలంగాణ సాధించడానికి
మార్గం శోధించాలే కాని...
కన్నవాళ్ళను శోక సంద్రంలో
ముంచేసే మూర్ఖత్వపు ఆలోచనలకు
స్వస్తి చెప్పాలి.

అసలే 'డొక్కు' జీవితాలతో
బతుకీడుస్తున్న మన తెలంగాణ బస్సులు
ఉద్యమకారుల ఆవేశపు మంటల్లో పడి
ఆత్మాహుతులవుతుంటే...
గుంటకాడ నక్కలాగ
కాచుక కూర్చున్న సర్కారుకు
దొరికిందొక సాకు
'ఛార్జీల' రేట్ల పెంపుతో ఆపలేరు ఉద్యమాల ఊపు!

సంధించే రాజీనామాస్త్రాన్ని చంకనెట్టుకొని
వంచకుంద్రి సామాన్యుడిపై ఉపన్యాసాల పోట్లు.
మున్ముందు తప్పవు మీకెన్నో పాట్లు !
హైకమాండ్ హస్తమెత్తి
సంఘీభావం తెలిపే వరకు
వేళ్ళు ఐదు ముడుచుకొని
తెలంగాణకు 'జై' కొడ్తూనే ఉంటుంది.

---

1974, గుమ్లాపూర్, కోరుట్ల మండలం.



## జమీన్ ఆస్మాన్

- వెల్దండి శ్రీధర్
9866977741

రోట్లె
తల్కాయె పెట్టినట్టు
ఇంకెన్ని రోజులీ
సంసారం !

ఇన్నొద్దులు అగోలిస్తె
నల్లపూసల తెల్లగుండు లేదు.
నీకైతే
పిడికెడు యిత్తునాలు సల్లితే
బత్తెడు గింజలు
ఇంట్లచ్చి పడుతయి.
నాకు బత్తెడు సల్లినా
పిడికెడు గింజలు సేతికిరావు.

మినరల్ వాటర్ బాటిళ్లు
సనసన్నపు బియ్యం
పంచామృతాలు
నీ వాకిలి తొక్కుతయి.
నేనేమో
దొడ్డుబియ్యం
గొడ్డుకారం
ఉప్పులేని అంబలి

కండ్ల నీళ్లు తాక్కుంట
పసురం లెక్క బతుకీడ్వాలె
నీలెక్క
నాకు
హరికథలు, పురాణపఠనం
కావ్యాలకు వ్యాఖ్యానం జెప్పుడు రాదు
నాదంతా
ఒగ్గుకథ, గొల్ల సుద్దులు, బైండ్లోని కథ.
నీది
ఇస్త్రీ మలగని
అస్తరుజల్లిన తెల్లబట్టల షోకు
నాది
అంగే లేని చెమట వాసన
అంగట్ల కాటగల్పి
నిండా దుక్కంల మునిగిన
పోరని ఆగం
నీకు నాకూ
జమీనాస్మాన్ ఫరక్.
ఇంకా
కల్సిండుడు
పీనుగుతోని సంసారం జేసినట్టే.
పంచాయితద్దూ
పెద్దమనుషులద్దు
నీ జాగా నీది నా జాగా నాది.
ఏండ్ల సంది గెట్టు పెట్టే ఉన్నది
గీత దాటితే మరోసారి సాయుధ పోరాటం
హద్దుల వుంటే అలై బలాయి పీరీలపండుగ.

1973, కోహెడ.



# పంచతంత్రం

- జిందం అశోక్
8978532225

కలనా?
నిజమా!!
మనుషుల్లో
ఒక నేల తల్లి కడుపున పుట్టిన
మెదళ్ళలో లేని
చైతన్యం
చలి చీమల్లో

ఎప్పుడు చూడనటువంటి
ఉద్యమ కిరణాలు
కోటి కాంతులు వెదజల్లుతున్నాయి

ఎప్పుడు విననటువంటి
విప్లవ గీతాలాపనలు
వేల గొంతుకలతో మారుమ్రోగుతున్నాయి

గాఢ నిద్రావస్థ !
నలుపు తెలుపు
చిన్నా పెద్దా తేడా లేకుండా
ఒకటే లక్ష్యంగా ఒకటే ధ్యేయంగా
ఒకే ఒక భావజాలం
పిడికిలై మొలకెత్తింది.

రెండు నిమిషాల మౌనం తర్వాత
ధర్నాలు దీక్షలతో
మాటలతో పాటలతో ఆటలతో

ఆత్మ బలిదానాలతో
ఏమి సాధించలేకపోయామనే
చర్చకు తెరలేచింది.

తెల్లవారకముందే
చంపడమా! చావడమా అనే
యుద్ధ "గీత"
పచ్చని ఒడిలో
పురుడు పోసుకుంది.

నిన్నటిదాకా
కండువాలు జెండాలు అజెండాలు
వేరువేరైన తలకాయలు
కొన్ని నేల రాలుతున్నాయి
మిగతావన్నీ లొంగిపోతున్నాయి.

మోసం తెల్వని
ఆడినమాట తప్పని
నీతి నిజాయితీ గల జాతి
ఆత్మగౌరవ జెండా ఎగరేసింది.

అటూ ఇటూ
ఆచేతనావస్థలో పొర్లుతున్న
నాకు
అప్పుడే
సూర్యుడు ఉదయించినట్లనిపించింది.

వెంటనే
నూతన ప్రజాస్వామ్యం వర్ధిల్లాలని వినిపించింది
వర్ధిల్లాలి ! వర్ధిల్లాలి !! అంటూ
నిద్రలేచాను.

1973, సిరిసిల్ల.



# శక్తి

- ఎర్రమరాజు బాపురాజు
9440239803

తెలంగాణ యువశక్తి ఉరకలేస్తున్నది
గెలుపుదిశగా విజయ బావుటెగరేస్తున్నది
తెగించిన తెలంగాణ గళం విప్పెరా
పోరుబాట పట్టి పొగలు గక్కెరా?

నవతరం యువతరం నిరంతరం శ్రమిద్దాం
జయ జయహో ! తెలంగాణ ఎలుగెత్తి చాటుదాం
అరువది ఏళ్ళ నుంచి పోరాటం చేస్తున్నం
పురోగమన బాటలో పరుగులు పెడుతున్నాం.
(శ్రీకృష్ణ) కమిటీలు వేసి కాలాయాపన చేస్తారా?
ఉద్యమాల ఉప్పెనను నెట్టుకు వస్తున్నాం.
పసికందులు మొదలుకొని ముసలి ముగ్గుదాక
అఘాయిత్యం చేసుకొని అసువులు అర్పిస్తున్నాం
వాడవాడ మోగుతుంది తెలంగాణ నగారా!
ఇదిగిదిగో నవోదయం తెలంగాణ శుభోదయం
మా తెలంగాణ భాష పలికితె "సారంగి"
ఎదురు తిరిగితె నీ పాలిటి "ఫిరంగి"
తెలంగాణ వాడు దేనికైనా సై సై
మమ్ములను ఎదుర్కొనెవాడు నై నై

1950, ధూళికట్ట, ఎలిగేడు మండలం.

## ఏరువడితే తప్పేంది?

- ముక్కెర సంపత్‌కుమార్
9959618206

అయితే ఏంది?
ఏరువడితే తప్పేంది?
గంపకింద కోడిపిల్లలోలె
సూరు కింద కుక్క కూనలోలె
ఇంకెన్ని రోజులు మిడుక్కుంటు బతుకాలే
కట్టం జేసి తెచ్చుకున్న బువ్వ, నీళ్లు
మా నోటికాడి కచ్చినంక దక్కకుంట జేస్తాంటె
ఇంకెన్ని రోజులు దొక్కలను మాడ్చుకుంట బతుకాలె?
ఎనుకటి సంది ఈ భూమి నాది
కాయకట్టం జేసుడు నేను,
నీ సేతికి మన్నంటదది–పెయి మీద సెమట సుక్క కనవడది
కాని.. పెత్తనమంతా నీదే .. నాది బాంచె బతుకు.
ఇప్పుడు నీదో సంసారం నాదో సంసారం
ఎవలది వాళ్ళే ఏరువడుదాం!
ఏదో కూడి ఉంటమనుకున్నా
కాని.. నాకే కూడులేకుంట జేస్తవనుకోలే
గాలికి పోయే కంపను కాలు తలిగిచ్చుకున్నట్టు
నీతోని సోపతి నాకే ఆపతి దెచ్చింది.
అందుకే అన్నా! మర్యాదకొద్ది అడుగుతున్నా
ఏరువడితే తప్పేంది?
ఎడ్డోనోలె కనవడుతున్ననా?
ఆనాడు రజాకార్లకు ఎదురుంగ నిలవడి
తెలంగాణ సాయుధ పోరాటం జేసినోళ్ల ఆనువాలు దొరికినయ్
అగో.. అసొంటి బాటల్ల నేను నడువకముందే
ముల్లె మూట సదురుకో
నీ తొవ్వ నువ్వు జూసుకో

---

1974, చేటపల్లి, హుస్నాబాద్ మండలం.



## అవస్థ

-పుల్లూరి జగదీశ్వరరావు
9441538797

తెలంగాణ యోధుల త్యాగ ధైర్యం చూసి
తనకు ముడి బిగిసే శక్తి
లేకుంటే బాగుండేదని
ఉరితాడు ఏడుస్తంది

తెలంగాణ పోరల తెగువ చూసి
తనకు షాక్ ఇచ్చే శక్తి
ఎందుకుందని, కరెంటు తీగలు
కలవరపడుతున్నాయి

తెలంగాణ బిడ్డల తెగువ చూసి
తనకు దహనశక్తి లేకుంటే
బాగుండేదని, అగ్నిదేవుడు
అల్లాడుతున్నాడు.

తెలంగాణ సింహాల సాహాసం చూసి
వాతలు వచ్చేట్టు కొట్టే శక్తి లేకుంటే
బాగుండేదని
లాఠీలు కలత చెందుతున్నాయి

తెలంగాణ వీరులు మృత్యువును
ముద్దాడం చూసి
యమపాశం ముందుకు
రావడానికి వెనుకాడుతున్నది.
(తెలంగాణ యోధులకు జోహార్లతో)

---

1967, వడుకాపురం, జూలపల్లి మండలం.

## సప్పసప్పని సంబరాలు

-ముదుగంటి సుధాకర్‌రెడ్డి
9490193969

తెలంగాణా రాక – తెలంగాణా తేలేక
పల్లెల్లో పట్టణాల్లో పండుగ పలుచబడ్డది
కరకరలాడే సకినాలు
ఖంగుతింటూ కన్నీర్ర జేస్తున్నాయి
తోరణాలు తుమ్మూతూ తుమ్మూతూ తూతూ మంటున్నాయి
గొబ్బెమ్మలు గోడు గోడు మంటూ ఘోషిస్తున్నాయి
గరికలు గరం గరమంటూ గర్జిస్తున్నాయి
సచ్చి బతుకుతున్న తెలంగాణోళ్ళకు సచ్చుడో బతుకుడో
తెలంగాణ తెచ్చుకుంటేనే పండగలు

---

1955, గోపాల్‌రావుపేట, రామడుగు మండలం.



## పునరింతులమవుదాం

- మంగళంపల్లి సత్తయ్య

ఉద్యమములోన నడ్డంకులుండునెన్నొ
వాటి నెదురొడ్డి, పోరాడవలెను గాని
వెనుకడుగిడుటెంతయు వెఱ్ఱితనము
వెఱవకూడదు, లక్ష్యమ్ముమఱవ వలదు.

గుఱ్ఱమొక్కటి స్వారికై గుణమునిచ్చు
రెండు గుఱ్ఱాలపై స్వారి దండుగగును
ఒకటి యొక వైపు మరియు నింకొకటి వేరె
వైపు పరుగిడ, సాగును పయనమెటుల
చేరవలసినచోటుకు చేరుటెటుల?

నాడు స్వాతంత్ర్య సమరాన నాయకులును
ఆంగ్లపాలకులెంత వెూయద్దుకొనిన
అదరకను మరి బెదరక నాయహింస
పోరునందు విజేతలై పేరుగనరె.

అట్టులేమనమును రాష్ట్ర సాదనమున
నెన్నియాటంకములు వచ్చియున్నగాని
వెనుకడుగిడకుంట వివేకముద్య
మమునపునరంకితుల మౌటమంచిదగును.

ఆగిపోలేదు ఉద్యమ మాగబోదు
లక్ష్యసిద్ధియౌవరకు విలక్షణముగ
శాంతి, సత్యాగ్రహాలతో సాగుచుండు
రాష్ట్ర సాధనె మనకు శ్రీరామరక్ష.

---

1938, ఇందుర్తి, కోహెడ మండలం.

## అందమైన తెలంగాణ

- గుండు రమణయ్యగౌడ్
9440642809

అందమైన తెలంగాణ తెచ్చుడే
అందరికి సమన్యాయం చేకూర్చుడే
ఆంధ్రుల పరిపాలన బందీ నుండి
ఆ సంకెళ్ళను తెగబడి తెంచుకునుడే

ఇది అరవై ఏండ్ల ఆరని పోరాటమే
ఇగ ఆగదు మా ఆకలి కేకతో కొట్లాడుడే
ఇకనైనా తోక ముడిచి వెళ్ళక పోతిరో
ఈ మా కళ్ళల్లో కోపాగ్నిని చూడకండిరో

ఊరకనే ఊరకుంటే ఊసరవెల్లులై
ఉరిమి ఉరిమి మా బతుకులన్ని ఛిద్రం చేస్తిరే
ఊర్ల మీద బడి వలస పస్తిరే
ఉన్నదంత మీరంత ఊడ్చుక పోతిరో

ఎవరి బలం చూసుకొని ఎగర బడ్తిరో
ఎవడబ్బ సొమ్మని మా భూములన్ని ఆక్రమించిరో
ఏ అధికారం మిమ్ముల్ని ఆపుతుందో చూసుకొండిరా
ఐకమత్యంతోనే మా తెలంగాణ తెచ్చుకొంటమురా!

---

1972, పెద్దాపూర్, జూలపల్లి మండలం.



## ఆలోసించి అడుగులేద్దాం

- కన్నోజు లక్ష్మీకాంతం
9246338115

సమస్య యీా నాటిది కాదుగానీ
ఇప్పటి దాకా నడుత్తనే వుంది.
ఇసంట రమ్మంటే ఇల్లంతనాదేనని
గోస గోస బెడుతుంద్రూ
ఆల్లే గోలగోల జేత్తుంద్రు.
మంచిగున్నన్ని రోజులు మంచిగనే వుంటిమి
పొరపొచ్చాలొచ్చినంక పోకుంటెందుకుండాలె.
బాగు జేసిసం, బాగైంద్రనేకన్న
బాగుపడ్డమంటె సంబురమయ్యేది గనీ,
కట్టెబెట్టినట్టు మాట్లాడుతున్నందుకే
కోపం కపాలానికంటుతందీ
నెత్తురు సలసల కాగుతంది.
ఎవలు ఎవల్తోని మంచిగైందిప్పుడెందుగ్గనీ
తలాపుకున్న నదులనుంచి
తండ్లాడినా నీళ్ళు రానందుకూ
నెర్రెలు బారుతున్న భూమి 'ఆలోలచ్చమనా' అంటుంటే
కనికరం లేని మనుషులతోని

కలిసుండు డెందుకని పిస్తందీ
ఇడిసిపెడ్తనే నయమని పిస్తంది.
మా బతుకు మేం బతకాలనుకుంటే
మెతుకు మెతుకు మీద మీ జులుమేనాయె.
ఏండ్ల తరబడి ఏడ్సి మొత్తుకుంటున్నా
ఏడేసిన గొంగడాన్నే వుండబట్టె
పిర్రలు జూసి పీటలేసే సర్కారుకు
'తెలంగాణ'మాట బలంగని పిస్తలేనట్టుంది.
ఉద్యమాలకు ఊపిరిపోసే పిడికిలి
తెలంగాణవాళ్ళదే అని తెలవనట్టుంది.
ఇంత లొల్లి లొల్లి ఆగమాగం జేసినా
ఆల్లపెయ్యి ఇర్రిర్రు మంట లేదంటే
ఇంకేం జేయాల్నో ఆలోసించాలె మరి
కొలువులు, యూసారాలు, ఫామ్లు, బూమ్లు
అన్నీ ఆల్ల తాన్నే వుంటె
బీరిపోయి సూసుడే మనవంతా!
గదేం గుదరదు.
మనం మన గురించి సోంచాయించాలే
మరెంత ముందుకురుకాలె.
పుణ్యానికి సచ్చిపోతే పిచోళ్లనుకుంటుండ్రు
గీ సచ్చుడు, సంపుడు పెట్టుకోవద్దు.
జరంత ఆలోసించి అడుగులేద్దాం
అందర్నీ ఒప్పిద్దాం.
కోపాలు, కొట్లాటలూ.. కాకుంటే పెద్దమనుషలు
ఆలోసించి పంచుకుంటే అంతా బాగనే వుంటది
కాదూ, కూడదనుకుంటే ఫలితం వేరేగుంటది.

1949, హుస్నాబాద్.



# లై డిటెక్టర్

- అన్నవరం గౌతం
8099875070

న్యాయం మీద అన్యాయం పెత్తనం
నాకిప్పుడే అర్థమైంది పైసలు ఏమైనా చేస్తాయని
కృత్రిమ ఉద్యమాలను కూడా పుట్టిస్తాయి

'సమైక్యత' అనే వలలో చిక్కుకున్న నేను
స్వేచ్ఛా సముద్రంలోకి ఈదడానికి
నా కళ్ళ ముందు కదలాడే అమరుల సాక్షిగా

'సమైక్యత' గొంతు కోయడానికైనా సిద్ధం
వారి పసలేని వాదన గిన్నీస్ రికార్డ్
ఉద్యమాలు చేయడం ఇక్కడ కొత్తేమీ కాదు

ఏ తరానికి ఆ తరంలోనే మాదిరి వినూత్నంగా
ఉద్యమాలు నడుస్తూనే ఉన్నాయి
నాయకులకు లై డిటెక్టర్ పరీక్షలు

చేసే సమయం వచ్చింది
పైసే పరమాత్మ అయినా వీళ్ళతో తెలంగాణ రాదు
వచ్చినా అది సుక్కంగా ఉండదు.
అది మనకొద్దు.

న్యాయమైన, స్వచ్ఛమైన తేట తెలంగాణ కావాలె
సాధిస్తా తెలంగాణ

1989, పోతారం (ఎస్), హుస్నాబాద్.

## ఇక మీ కథ ముగిసింది

- మియ్యాపురం శ్రీనివాస్

కోటి లింగాల సంస్కృతి మాది
వేయి స్థంభాల బలం మాది
రాజ్యం మాది... బంగారు భూములు మావి
నీళ్ళు మావి నదులు మావి గనులు మావి ఓట్లుమావి
ఇక ఈ ప్రాంతం వదలండిరా
ప్రాణాలు కాపాడుకోండి... ఖబడ్దార్... ఖబడ్దార్..
ఇక మీ కథ ముగిసింది ఇక్కడ
తలవంచుకు వెళ్ళిపోండి
మొండెంతో వెళ్ళకండి
హైద్రాబాద్ మాదేరా
హైద్రాబాద్ మాదేరా
ఇది మా గుండెకాయరా
ఇది మా ఆత్మరా
మీ చరిత్రలో ఏమున్నది గర్వకారణం
మా తెలంగాణను మీరు దోచుకోవడం తప్ప
తలవంచుకుని వెళ్ళిపొండిరా!
రాజశేఖర్రెడ్డి, చంద్రబాబు, చిరంజీవి..
ఒక్కొక్కడు మా తెలంగాణా విద్రోహులే
నీళ్ళు మావి ప్రాజెక్టులు మీవి
ఓట్లు మావి అధికారం మీది

---

1955, ఎల్లారెడ్డిపేట.



## తీరం దాటని తుఫాన్!

- పంకేపల్లి నాగేంద్రశర్మ
9346814782

ఆ నావ తీరం దాటలేదు
తెలంగాణా హోరు తగ్గలేదు
భారత్ సాగరంలో
తెలంగాణాలో జోరు సడలిపోలేదు
ఆసియాను, ఐరోపాను కదిలించిన
రైతాంగ పోరాటాల పటిమ రోజురోజుకు జోరెక్కుతోంది

కరడు గట్టిన నైజామ్‌ను
ఎదిరించిన మా శౌర్య ప్రతాపాలు చల్లారక ముందే,
ఆంధ్రావాలా గోబ్యాక్, ఇడ్లీ సాంబర్
గోబ్యాక్, నాన్ ముల్కీవాలా గోబ్యాక్
నినాదాలు మా మొదటి ఆయుధాలే !

1969లో నాలుగు వందల మంది విద్యార్థుల ఉద్యమ కీలలు
ఎగిసిపడి మా అస్తిత్వాన్ని మరోసారి జనపావనం చేశాయి...
మళ్ళీ పెద్దలు ఒప్పందాలు చేసి
షట్సూత్ర పథకాలని అంటూ చేయి తుడుచుకున్నా,
రాజకీయ నాయకులు దొరతనాల కోసం రాజీపడి కక్కుర్తిపడ్డా..
తెలంగాణా బిడ్డల గుండెల్లో నుండి
జారిపోని ఉద్యమ స్వరాలు... నేటికినీ ప్రతిధ్వనిస్తూనే వున్నాయి..

వస్తున్నాయ్, వస్తున్నాయ్ జగన్నాథుడి రథ చక్రాలే కాదు,
జనారణ్యం నినదించే కరాలవాల నవతేజాలు.. అణువిస్ఫోటనాలు..
పీడిత గ్రామీణ జనం, పామర జనం, సర్వప్రవృత్తుల
సబ్బండ కులాలు కోరుకుంటున్న
సింహనాదాల ముందు సమైక్యాంధ్రుల
పిల్లపిచ్చుకల అరుపులకు.. ఏర్చికూర్చిన సప్తస్వరాలకు..

త్యాగయ్య, అన్నమయ్య నాదాలకు.. మేం అదరం, బెదరం..

ప్రతిదాన్ని రాజకీయం చేసి చూడొద్దంటున్నాం
ఇక్కడి నాలుగున్నర కోట్ల ప్రజల ఆశలు, ఆశయాలను
పండించాలని అంటున్నాం
పాలమూరు వలస కూలీలు, నల్లగొండ ఫ్లోరైడ్ జలాలు,
మేత, మెతుకులేని సీమల, పటాన్‌చెరువు పారిశ్రామిక ఉపద్రవాలు
ఆమ్లవర్షాలు, దరిద్రాలు, కన్నీటి కరువులు, ఆత్మహత్యలు, ఆకలి చావులు
తెలంగాణా మహోద్యమ ముఖ చిత్రాన్ని మరింత భద్రం చేస్తూనే వున్నాయి..!
నక్సలిజం ఇక్కడే ఊపిర్లూదింది!
యూనివర్సిటీ విద్యార్థుల ఉద్యమాలు అగ్నిగుండాలై ప్రవహించాయి
అమరవీరుల బలిదానాల సంస్మరణ ఘంటలు నిత్యం
మోగుతూనే వున్నాయి.

కటిక నేలకు, బుక్కెడు బువ్వకు, దొద్దుబట్టకైనా.. నోచుకోమా..
మీకు ఎన్నాళ్ళు గులాములైపోతాం..
మీకేనా పచ్చపచ్చటి తీరప్రాంతాలు..
నీళ్ళకాలువలు.. పుట్లకొద్ది ధాన్యాలు..
ఆకలి చావని కడుపు మంట మాది,
నల్లని ఉక్కుపిడికిళ్ళ ఆకలి పోరాటాలు మావి..
కడుపునిండి ఏడ్చే మొసలి క(ప)న్నీరు మీది..
మాగజాల జాగలు ఖాళీ చేయకుంటే..
తెలంగాణాన్ని వద్దంటే ప్రజాస్వామ్య ఉద్యమాలు కాదు..
జన సంకుల సమరాలు వస్తాయి..
కృష్ణుని మురళీ రవాల ముందు
కేరింతలు కొట్టే గోపికలం కాదు సుమా!
కురుక్షేత్ర యుద్ధాలతో
తడిసిన నేలలివి..
ఉద్యమ ఘీంకార స్వరాల
రణరంగ దుందుభులివి...

1960, వేములవాడ.



# పదునెక్కిన మాట

- గంపల శ్రీనివాస్
9010834159

పక్కన పండుకుంటే
పానమిచ్చెటోడనుకున్న
నవ్వుకుంట మాట్లాడుతె
నాలుగు కాలాలపాటు నాతో సోపతి జేత్తడుకున్న
నేనేడుత్తాంటె
ఏడ్వకు అని నా ఎదను నిమురుతుంటె
నా ఆత్మ అని అనుకున్న
కానీ..
నీ కుట్రదెల్సి నేను దూరముంటునంటె
నా కాళ్ళకు కళ్ళెం వేసి
గుంజగట్టేసినవ్
అమాంతం ఆశ్చర్యపోయిన నేను
దిక్కులు చూస్తూ పిక్కటిల్లెటట్లు ఏడ్చిన!
చిన్నప్పుడు మొగురానికి కట్టి
కైకిలిపోయిన కన్నతల్లనుకున్న
ఎప్పటికైనా పాలివ్వడానికి వస్తావని
కానీ..
కాలం తరుగుతుంది
ఆకలి పెరుగుతంది
కడుపు మాడుతంది
నా ఆలోచన పగటి పదునెక్కిన వడగాలైంది!
మలి సంధ్యా సమయపు సుడిగాలైంది!
ఎన్ని దినాలీ కట్టం
ఇగజాలు నీ సోపతి
సావు మర్మమైతాంది నీతో

1980, జనగాం, హుస్నాబాద్ మండలం.

## జై తెలంగాణ

- శ్రీమతి జొహరాబాను
9912268440

కోటి రతనాల వీణ

నా తెలంగాణ

అన్నారు, మహాకవి "దాశరథి"

కానీ, నేడది

కోటి గాయాలతో

తల్లడిల్లుతున్న తనువు

తల్లీ! తెలంగాణా

నీ జీవన వీణ

పలికేనా

ఎప్పటికైనా!

నీ తంత్రులు

సీమాంధ్రుల చేతుల్లోంచి

విడిపించేనా

సోనియమ్మ

ఎండమావిలో నీటిలా

శ్రీకృష్ణుని కమిటి

నోరు తెరచి చూపించునేమో

మనల్ని మనం ఏలుకునే

మన తెలంగాణ !

జై తెలంగాణ ! జై జై తెలంగాణ !!

1968, జమ్మికుంట.

## తెలంగాణ జ్యోతులం

- మంథని వినోదస్వామి
9866301269

తెలంగాణ తల్లి బిడ్డలం

పోరు చేయ కదిలినాం

కన్నతల్లి రుణం తీర్చ

కంకణాలు కట్టినాం

దేనికైనా సిద్ధమంటూ

తెగించే వచ్చినాం

అడ్డు వచ్చిన ద్రోహులను

అగాధంలోకి తొక్కేస్తాం

సింహాలమై గర్జిస్తాం

సమరమే సాగిస్తాం

విజయం సాధించే వరకు

వెనుకాడం, వెనుచూపం

ప్రాణానికైన తెగిస్తాం

ఆత్మ గౌరవాన్ని నిలుపుతాం

జ్యోతులను వెలిగిస్తాం

చీకటిని తరిమేస్తాం

తెలంగాణ పోరు నడప

తెగించే ఉన్నాము
ఉప్పెనలా వస్తాము,
తరిమి తరమితంతాము
తెలంగాణ మా జన్మహక్కని
వెలుగెత్తి చాటుతాం
సునామిలా చుట్టిముట్టి చుక్కలు చూపిస్తాం
అమ్మ తెలంగాణమ
నీ కనక గర్భమున
పుట్టినందుకు ధన్యులం
మేము ఉన్నంత వరకు
మా గుండెలలో నిదురించూ
మమ్ములను దీవించూ
మునుముందుకు నడిపించూ.
పది జన్మలకు సరిపెడ
మమ్ములను కనిపెంచూ
ప్రాణమున్నంత వరకు
నీ జపమే చేస్తాము
తెలంగాణ తల్లి నీకు
చేతులెత్తి మొక్కుతాం
జయ జయ హే తెలంగాణ అంటూ
గొంతెత్తి పాడుతాం
అమరవీరులం సాక్షిగా
ఉద్యమానికి ఊపిరివై
తెలంగాణ వచ్చే వరకు
రణం నడుప ధైర్యమివ్వు

కాల్వశ్రీరాంపూర్.



# బతుకు పోరు

- కూకట్ల తిరుపతి
9949247591

సిరులున్న తెలంగాణపై కన్నేసి
బతిమిలాడి బామాడి
విశాలాంధ్రలో విలీనం చేసుకున్నరు
మత్తగొలిపినట్లు కండ్లు గప్పి
నోటికాడి బువ్వను గుంజుకొని తిన్నరు
మనం బొంకిచ్చి బోర్లేసి
నిధులు నీళ్ళను మళ్ళించుకున్నరు
సొక్కంలా సక్కదనాల
తెలంగాణ సంస్కృతిని తెర్లు జేసిండ్రు
జన జీవితాలతో పెనవేసుకొని
కళకళలాడిన ప్రజాకళలు కళ తప్పినయి
నీటెద్దడితో బతుకులు ఎద్దం మద్దెయైనయి
గొడ్డుగోదకు కటానకర్ర పుటాన వల్ల దొరకదు
మందలు మన్నెంబోయి మ్యాతకు అరిగోసపడుదు
పొట్టచేత వట్టుకొని బతుక బోవుడు
ఆకలి చావులు ఆత్మహత్యలు హెచ్చినయి
అంగట్లో అన్నున్నా అల్లున్నోట్లో శనన్నట్లు
తెలంగాణ బతుకులు తెల్లారిపోతన్నై
నీళ్ళందక పడావుపడి ఎడారిగా మారితే
గోస గానలేక గోదారి ఘోల్లుమనే
కరువు కాటకాలతో పానాలు కడతేరుతుంటే
పీనుగుల పెంటను జూసి కృష్ణమ్మ కన్నీళ్ళు పెట్టే

తెలంగాణ వనరుల తరతరాల దోపిడీకి
సబ్బండ వర్ణాలు సోయికచ్చినయి
మత్సరిచ్చి మాయజేసుడుకు
ఇక నూకలు చెల్లినయనీ
పొక్కులు పొక్కిన బతుకులు
పొక్కిలైన వాకిళ్ళు ఒక్కటైనయి
మా తెలంగాణ మాగ్గావాల్ననీ
గల్లి గల్లిన లొల్లి సురువైంది.
కన్నెర్ర జేసి కాశలు వోసిన వీరులపై
లాఠీలు తూటాలు రాజ్యమేలుతన్నె
నెత్తురు చిలచిల చిందిస్తున్నరు
అసువులు అర్పించి అమరులవుతున్నరు
పోరాటాల పురిటిగడ్డ వీర తెలంగాణ
భావి తరాలకు స్ఫూర్తి నింపుతున్నరు
రజాకార్లను తరిమికొట్టిన వీరత్వం
దొరతనంపై తిరగబడ్డ శూరత్వం
నిజాం నవాబు మెడలు వంచిన వారసత్వం
ప్రతొక్కరి నరనరాల్లో పారుతున్నది
నిప్పుల కొలిమై మండుతున్నరు
వలసవాదాన్ని పొలిమేర దాటించ
పొలికేకలు వెడుతున్నరు
ఒక సూర్యుడు అస్తమిస్తే
వేయి మంచి శూరులు ఉదయిస్తున్నరు.
దేశ చరిత్ర పొత్తపు పుటల్లో
పుత్తడి అక్షరాలతో ఎక్కుతున్నది
ప్రత్యేక తెలంగాణ పోరాటం.

---

1975, మద్దికుంట, మానకొండూర్.



## తెలంగాణ సాధిద్దాం

- రేగులపాటి విజయలక్ష్మి
9849246980

తెలంగాణ పోరాటం నిన్నటిదా ? మొన్నటిదా!
నలుబదేండ్ల పోరాటంలో
నలిగి పోయినా తెలంగాణ
తెలంగాణ ఇస్తమని నమ్మిస్తూ
మోసగించే రాజకీయ పార్టీలు
కలిసి ఉంటే నష్టమేంటి అంటరు
మన ఉద్యోగాలు లాక్కుంటున్నరు
నీళ్ళు మళ్లించు కుంటున్నరు
జరుగుతున్న నష్టం పిల్లలకు కూడ తెలుస్తున్నది
ప్రతి ఇంటా తెలంగాణా వాదం
ప్రజ్వరిల్లుతుంది నేడు
విద్యార్థుల ఉద్యమాలు విజృంభిస్తున్నాయి
మూడు వందల మంది విద్యార్థులు ప్రాణాలర్పించినారు
అయినా కరుగని కసాయి ప్రభుత
విద్యార్థులారా ఆత్మహత్యలు చేసుకోకండి
మన తెలంగాణ మనకు తప్పక వస్తది
మనం సాధించుకునే తెలంగాణ వనరులు
మనం అనుభవించడానికి బ్రతికి ఉండాలి
నీ ప్రాణం పోతే ఎవరికి నష్టం బిడ్డా!
నీ తల్లిదండ్రులకు నీ తోబుట్టువులకు
తీరని ఆవేదన. అందుకే
బతికి ఉండి సాధించుకుందాం
కలిసి కట్టుగా పోరాడుదాం
పోరాడుదాం పోరాడుదాం
తెలంగాణ వచ్చే వరకు
పోరాడుతూనే ఉందాం

---

1952, గూడెం, ముస్తాబాద్ మండలం.

## ఆకలి

- కొట్టె భాస్కర్‌రావు
9849635662

ఆలోచనలో వున్న నాకు
'ఆకలి' అన్న కేక వినిపించింది.
బయటి కొచ్చి ఆ వ్యక్తిని
జాలి వేసి ఇంట్లోకి రమ్మన్నాను.
    ఆకలి ఎవరికైనా ఆకలే కదా !

ఆకలి దప్పులు తీర్చాను
విశ్రాంతి పొందిండు

అటెన్క ఇంట్లోని వాసాలు లెక్కగట్టిండు.
ఇల్లు తనదేనన్నాడు
ఆధిపత్యం అధికారం చూపెట్టాడు.
    ఏకు మేకైనాడు

దయకు దయ - కరుణకు కరుణ
దెబ్బకు దెబ్బ తెలంగాణ నైజం.

అందుకే అక్రమంగా జొరబడిన
చండాలులను చీల్చి చెండాడుదాం.
తెలంగాణ సత్తాను చూపెడుదాం.

తెలంగాణ సాధిద్దాం
జయకేతనం ఎగురవేద్దాం.
జై తెలంగాణ - జై జై తెలంగాణ

---

1947, మూర్‌మూర్, రామగుండం.



## తెలంగాణ పిచ్చుక

- డా॥ సముద్రాల జనార్ధనరావు
9396969217

అనగనగా ఒక చిలుక
అది సీమాంధ్ర పంచరంగుల చిలుక
మన తెలంగాణ ఒక పిచ్చుక
బంగారు గ్రుడ్లు పెట్టే పిచ్చుక
పిచ్చుక చిలుక రెక్కల్లో చిక్కి విలవిలా
పంచరంగుల చిలుక పకపకా
"నన్ను ఇడువు స్వాతంత్ర్య వీధిలోకి"
"లేదు లేదు నిన్నసలే విడువను
నేను పెద్దన్నను నీవు చిన్న తమ్ముడివి
"అధికారం నాదే, ఆధిపత్యం నాదే
రాజ్యాధికారం మాదే రాజధాని మాదే
నా పలుకే రాజనీతి, నా మాటే ఒక జీ.ఓ
శ్రమ నీది కావచ్చు కాని పరిశ్రమలు మావే
నదులు మావి కావచ్చు కాని నీరు మాత్రం మావే
గనులు నీవి కావచ్చు కాని వాటి గమ్యం మాత్రం సీమాంధ్రదే
వనరులు మీవి కావచ్చు కాని వడ్డించేది మేమే కదా
ఉద్యోగాలు మీవి కావచ్చు కాని అవి చేసేది మేమే
ఊళ్ళుమీవే కాని అవి ఏలేది మా కనుసన్నల్లోనే
చిలుక రెక్కల్లోంచి రాలేని పరిస్థితి
ఇదే మన తెలంగాణ దుస్థితి

---

1945, దొంగతుర్తి, ధర్మారం మండలం.

## మోసపోయిన తెలంగాణ

- రొడబోయిన వెంకటరాజం

తెలంగాణులను చిత్తు చేయుటకై
చేసారు ఎన్నో కుట్రలు - కుయుక్తులు
భారీ ప్రాజెక్టుల నిర్మాణ ప్రక్రియను పసిగట్టి
పంట-బీడు స్థలాలనెన్నో తక్వదరకే కొన్నారు
తెలంగాణ రైతన్నలు మోసపోయినారు.
కూడుగుడ్డకు అలమటించి వలసబాట పట్టారు
గల్ఫ్ ఏజెంట్ల మోసపు కోరలకు బలైనారు
అడుగడుగున ఆంధ్రుల ఆధిక్యతే
ఆంధ్రప్రదేశ్ అంతా వారి స్వాధీనమే
పది జిల్లాల పల్లె తల్లి బిడ్డలను
నిరుద్యోగ నిశీథములోకి నెట్టేశారు.
పది జిల్లాల తెలుగన్నలకు పర్వదినం
ప్రత్యేక తెలంగాణ సాధన సుదినం
ప్రత్యేక తెలంగాణ బాల్ (జెబిజిజి)
చేరుతుంది ఎన్నటికైనా ప్రత్యేక రాష్ట్రం గోల్ (గమ్యస్థానం)

సిరిసిల్ల.



## మమ్మల్ని వదిలేయండి

- డా॥ సందివేని రవీందర్
9440488515

చిమ్మిన నెత్తురు సాక్షిగా
పాలమూరులో పడగెత్తిన
కరువు రక్కసి
కలుసిత నీరుత్రాగిస
వంగిపోయిన దేహాలు

గుక్కెడు నీటి కోసం
గొంతు చించుకునే
హృదయవేదనలు
తెలంగాణ...!

చదివిన చదువులకు
ఉద్యోగాలు రాక
నిరుద్యోగులై
నేలరాలుతున్న
తెలంగాణ బిడ్డలు
ఎంతని చెప్పను.
మా కడివెడు కన్నీరు
వద్దు బ్రదర్...
మీకు మాతో యుద్ధం.

యాభై మూడు వత్సరాల
అణచివేతకు
శిథిలమైన మా దేహాలు
కుప్పకూలినవి.
మా కుటుంబాలు
ఇక వదిలేయండి
మా బతుకులు
మేం బతుకుతాం.

కరీంనగర్.

## ఏం తక్కువ

- వాసాల విజయ్‌కుమార్
9849112530

అరుపులు
ఆమరణ దీక్షలు
ఆగ్రహజ్వాలలు
ఆత్మహత్యలు
అర్ధశతాబ్దపు ఆక్రందనలే
నేటి తెలంగాణ ఉద్యమహోరు,
అమ్మలాంటి భారతీయం సాగించిన
అలనాటి స్వాతంత్రోద్యమ పోరుకు
ఎన్ని 'బలిదానాలు' తక్కువ..?



వ్యాపారం వంకతో వలసవచ్చి
ఆసాంతం ఆక్రమించి
అన్నీ తరలించుకెళ్ళిన
ఆ తెల్లదొరల ఆకృత్యాలకు,
కలిసుందామంటు వచ్చి
కనిపించే, కనిపించనివన్నీ
కండ్లెదుటే తరలించుకు
కడుపులన్ని నింపుకుంటున్న
ఈ ఆంధ్ర దొరల ఆకృత్యాలకు
ఎన్ని 'అపహరణలు' తక్కువ..?

అహింసామార్గపు 'ఆందోళ'నలకు జడిసి
ఆ బ్రిటిష్ వాడు సైతం
అర్ధరాత్రికి రాత్రి ఇచ్చిన స్వాతంత్ర్య ఫలానికి
అదే బాటలో పయనిస్తూ
అలుపెరుగక ధ్వనిస్తున్న
నేటి తెలంగాణ అహింసాత్మక పోరుకు
ఎన్ని 'నిరసనలు' తక్కువ..?

అనాటి జలియన్ వాలాబాగ్‌కు
నేటి ఉస్మానియాకు
ఎన్ని 'లాఠీలు' మరెన్ని 'తూటాలు' తక్కువ...?

నాటి తరంలో రగిలిన 'వందేమాతరానికి'
నేటి వాడవాడలా ధ్వనిస్తున్న "జై తెలంగాణా" కు
ఎన్ని 'గొంతుకలు' తక్కువ...?
తక్కువల్లా ఒక్కటే..
'తెలంగాణ' రాష్ట్రాన్ని వెంటనే ప్రకటించ(కపోవ)డం.

---

1978, కోరుట్ల.

## తెలంగాణకు పట్టాభిషేకం

- దేశరాజు దేవలింగం

దగా చేసిన ఆంధ్రనేతల పాలనలో
తెరువగానని పెద్దలొప్పదం
నీరు కారిపోయింది
నారు పోసిందీ జనహృది చేలల్లో
నీరు పట్టిందే తెలంగాణ పైరుకు

అందుకే
దశదిశలా తెలంగాణ ఉద్యమమై వెలుగులోకి ప్రాకింది



నేతల నాల్కలపై
గాలివాటం మాటల ప్రవాహమై సాగుతోంది
విద్యార్థుల చేతల్లో చేతనై ఊపిరులూదుకుంది
రాష్ట్రపతి ప్రసంగభవనంలో
చోటు సాధించు సుదీర్ఘయానంలో
చేతివాటం చూపించింది.
ఆగని ఆత్మబలిదానాల
ఆరని చితి మంటల్లో
ఎగసే జ్వాలలోద్యమమై మింటి నంటుతున్నది
అగంతక సమైక్యవాదం
ఇది చూడ నిచ్చగించక మనసొప్పక
ఆకతాయిగా ప్రతి ఉద్యమం నడిపిస్తోంది.
ఆరని ఉద్యమ జ్వాలలకు
ఆజ్యం అప్రహతితంగా పోస్తోంది.

జవజీవాలను పిడికిట బట్టిన తెలంగాణా
మనుగడ కోసం ప్రాకులాడుతూ
నేతల రాజీనామాలకు తెరలేపింది.
పల్లె–పట్నం తెలంగాణకై తపిస్తున్న వైనం
పరిశీలకుల (శ్రీకృష్ణ కమిటి) కళ్ళకు కట్టింది.

రాజీలేని పోరులో
అంకితభావం కలబోస్తూ
జనగణం తెలంగాణకు సమరయోధుయ్యై మద్దతుగా
తీర్మాణాలను పుంఖానుపంఖాలుగా పంపుతోంది.
రేపటి ఆశకు పట్టాభిషేకం చేస్తూ...!

---

మెట్‌పల్లి.

# మనదే - మనకే

- మంత్రి లక్ష్మీనారాయణ
9347552538

కదం పదం
ఒక్కటే
అందరి పథం
ఒక్కటే
వాదమైనా నినాదమైనా
గానమైనా ప్రాణమైనా
అంతా తెలంగాణం
అందరి జీవనాదారం
నాలుగుకోట్ల రతనాల
భాండాగారం
కుట్రలతో కుయుక్తులతో
కొల్లగొట్టిన వైనం
ఊపిరి అందించే
మా జీవనది మానేరు
మా జీవితాలవలెనే
ఊపిరందక ఉక్కిరిబిక్కిరి అవుతున్నది
గోదారి తల్లి ఒడిలో
అందాల మాటున
అగాధాల ఆవేదనలు
ఆకుపచ్చని స్వప్నాల
పాపికొండల బేలదృక్కులు
ప్రాచీన నెలవుల
కోటిలింగాల కోటి నిట్టూర్పులు
సంకల్పం సారథ్యం
అంతా మనదే
సాధన మనదే
సాధ్యం మనకే.

సిరిసిల్ల.



# పోరాటం

- బొట్ల సతీష్‌కుమార్
9985960614

అధికారం కోసం ఆరాటం కాదు మాది
ఆకలి మంటల పోరాటం
ఆస్తుల కోసం ఆరాటం కాదు మాది
అస్తిత్వం నిలుపుకునేందుకు పోరాటం
అనగదొక్కాలి అనే అహంభావం కాదు మాది
ఆత్మగౌరవం కోసం అంకితభావం
స్వార్థపూరితపు రాజకీయాలు కావు మావి
స్వపరిపాలన కోసం సాగించే సమరాలు
బలిసిన మాటలు కావు మావి
బలిదానపు బాటలు
కదలలేని కడలి కాదు నా తెలంగాణ
ఉరకలేసే ప్రవహోద్యమ పరిమళం
అమర వీరుల త్యాగాల స్మృతులే
మా జీవిత గతులు
ఆత్మార్పణ చేసుకునే వీరుల ఆశయమే
మా అన్వేషణ మార్గం
చరిత్ర గతిని మార్చుటమే మా ధ్యేయం
తెలంగాణ సాధించటం ఖాయం
అప్పటి వరకు
తెలంగాణ పోరులో ప్రాణాలు అర్పించే
ప్రతి వీరుడు
మళ్ళీ రేపు ఉదయించే సూర్యుడు
మాలో ఉద్యమ స్ఫూర్తి నింపే ధీరుడు
మా మనస్సులో కలకాలం నిలిచే అమరుడు

1986, బొట్లవనపర్తి, ధర్మారం మండలం.

## తాడో... పేడో...

- జీడి రమేశ్
9652765516

తల్లి బానిస విముక్తికి
పుత్రుల ఆరాటం,
ఉక్కు కండరాల వీరులు
నిప్పులు చిమ్ముకుంటూ
పొటెత్తిన కోపంతో
పట్టాలెక్కుతండ్లు...

ఓ 'కాంతి'
నింగినెక్కి
తొవ్వ సూపి
తొంగి సూతంది.

'వేణు' నాదం
గీతోపదేశం
ఉద్యమం జెయ్యమన్నది

'కరుణ'
కంకణం తొడిగి
ముందట నిల్సుండుమన్నది

కబ్జా
బాయి మాదే
బొక్కెన మాదే
పారేది మాత్రం
మీ మడిల్నా...?
శెలిమెలల్ల 'నీల్లు'
ఇంకకుండ జేత్తిరి.

పావుల జాగకు



బారాణ పెడితిరి
మీ బలుపులు సూపిత్తిరి.

మా
ఆషారాలకు
సంస్కృతులకు
సదువులకు
మసి బూత్తిరి.

ఆకలికి
మా యాసను గూడ
మరిపిత్తిరి.

సర్కారుకు
మేం గట్టిన పైకం
దోసుకొని తింటిరి
గిందేందంటే...?
అభివృద్ధి అనవడ్తిరి
విశాలాంధ్రను జూపితిరి.

ఇగ రాండ్లి..
పాదయాత్రలకు
బస్సుయాత్రలకు
ప్రజాపథాలకు
మీ తిరోక్కెషాలకు
శెప్పుల దండలు
తయారుగున్నయి.
గుల్ల బడ్డమనకుంటాలేందో
ఖబడ్దార్..
తెగెదాక గుంజుడే
కాయొ పండో
బొచ్చొ గుండో
తాడో పేడో..

---

1987, పల్లగుట్ట, స్టేషన్ ఘన్‌పూర్ మండలం, వరంగల్ జిల్లా.

## జీవనాడి

- రాపర్తి శ్రీనివాస్
9705043022

నా జీవనాడి నా తెలంగాణ
చల్లనైన అమ్మఒడి నా తెలంగాణ
వెండికొండ దైవము వేములాడ రాజన్న
వేయిస్తంభాలగుడి, వేదాల ధర్మపురి
కాళేశ్వర ముక్తేశ్వర పావన గోదావరి
కాకతీయ కాంతిరేఖ కమనీయ రామప్ప
అలంపూరు జోగులాంబ ఆదిలాబాదు భారతమ్మ
అడవి దేవతలైన సమ్మక్క సారక్కా
భద్రగిరి రామయ్యా యాదగిరి నరసయ్యా



దేవతలందరికీ దేవళమీ తెలంగాణ
పల్లెమాట పదములకు పసిడికాంతులద్దినాడు
పండిత ఆరాధ్యుడైన పాలుకుర్కి సోమన్న
అమ్మపాల కమ్మదనం అక్షరాల నింపినాడు
అమ్మనెవరి కమ్మనన్న అమృతమూర్తి పోతన్న
నా తెలంగాణ కోటి రతనాల వీణ యంటూ
రాజసాన్ని రంగరించి నింపినాడు దాశరథి
నిజాము గుండెలపైన అక్షరాల బాణాలు
వదిలినాడు సురవరం, గోలకొండ మనవరం
కలమే తన గళంగా నినదించిన కాళోజి
పాటమే తన మాటగా కదిలిన మన సినారె
కవులందరి కన్నతల్లి కమనీయ తెలంగాణ
కావ్యాల కల్పవల్లి కరుణామృత తెలంగాణ
మానేరు గలగలలు ప్రాణహిత పరువాలు
మంజీరపు నాదాలు కిన్నెరసాని నాట్యాలు
గోదారమ్మ కన్నతల్లి, కృష్ణమ్మ పాలవెల్లి
నదులన్నీ నాజూకుగ నడుస్తున్న తెలంగాణ
హస్తకళల పెంబర్తి వస్త్ర కళల సిరిసిల్లా
దారు కళల నిర్మల్ చేనేత కళల గద్వాల
నల్ల బంగారు సిరుల చిరునామా సింగరేణి
వెలుగుల వెల్లువలైన వేకువరా ఎన్.టి.పి.సి.
చక్కనైన వనరులన్న చల్లని నా తెలంగాణ
ఆంధ్రవలస పాలనలో అణగారి పోయింది
అమరులైన వీరుల ఆశయాల సాక్షిగా
అనుపమాన తెలంగాణ అవతరించి తీరాలి

---

1974, ధర్మపురి.

## ఓ ముక్కుసూటి కథ...!

- వాసాల వరప్రసాద్
9490189847

నాయినా..
నేను వేరుపడుతా..!
ఇట్టు పెద్దోనితోని
అటు చిన్నోనితోని
నేను వేరుపడుతా...!

నాకు పెద్దోని దోపిడద్దు
నాకు చిన్నోని యాతనద్దు
పెద్దోడు–చిన్నోడు కల్సుందామని నమ్మబల్కి
అంతా తమ పొట్టేస్కుంటున్నరు..
నేను నాకోసం వేరు పడుతా..!

నన్ను వేరుపడేస్తే
ఏదో అయిపోతదని
పెద్దోడు నీతో చెప్పుకొస్తడు
మన కుటుంబం ముగిసిపోతుందని
నమ్మకంగా చిన్నోడు నిన్ను రెచ్చగొడ్తడు !



కానీ
నాయినా...!
నన్ను వేరుపడేస్తే
నేను నేనుగా బ్రతుకుతా..
నీకిప్పుడే సెప్తున్నా
నీకెదిగి సూపిస్తా...!

నన్ను వేరుపడేస్తే
నేను మళ్ళీ వీళ్ళతో కల్వనంటరేమో...?
అయినా ఇప్పటికీ ఎప్పటికీ
వీళ్ళ మీద నా ప్రేమ సావదు,
ఎందుకంటే మాది రక్త సంబంధం గదా...!

ఇంకా కలిపి ఉంచాలనుకుంటే
వీళ్ళతో నేనుండను కల్సి,
నాకొచ్చేది ఏదో ఇచ్చేసేయ్
నేను నాకు పుట్టినోళ్లకు
నిండైన స్వేచ్ఛా జీవితాన్నియ్యాలే..!

అయినా
ఇంకేమన్నుంటే మాట్లాడుకుందాం
పరస్పరం చర్చించుకుందాం..!
కానీ..
వెయ్యేళ్లయినా వేరుపడక తప్పదు
నా ఆశ (56 ఏళ్ల) నెరవేరక తప్పదు.

నాయినా..!
నన్ను వేరు పడేయ్..
నన్ను వేరు పడేయ్..!

---

1977, మెట్‌పల్లి.

# పోరుకేక

- పెద్దోజు నరేశ్
9493040665

దుర్మార్గం సాగదిక
దగాతనం నడువదిక
ఉరిమింది పోరుకేక
తెలంగాణ వచ్చేదాక
ఉద్యమ స్ఫూర్తి దాతల్లారా!
ప్రత్యేక నినాదపు ప్రదాతల్లారా!
రండి ! రండి !
రండి ! కదలిరండి
ఉద్యమించండి
ఉద్యమాలకు ఊపిరినివ్వండి
ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనకై
తెలంగాణ ప్రజలంతా
చెయ్యి చెయ్యి కలుపుదాం.
వీరత్వం చూపిద్దాం
విజయం సాధిద్దాం.
తెలంగాణాను ఏలుకుందాం!
మన బతుకులు బతుకుదాం.
జై తెలంగాణ.
జై జై తెలంగాణ.

---

1988, మరిపెడ, వరంగల్ జిల్లా.